# సంపూర్ణోత్తర
# రామాయణము.



గ్రంథకర్తలు.

రామనారాయణ కవులు

# ఆంధ్రనాటకములు.

| | రు. అ. | | రు. అ. |
|---|---|---|---|
| కనకతారానాటకము చం॥ శే॥ | 1 4 | గయోపాఖ్యానము చి॥ ల॥ | 0 8 |
| కృష్ణలీల బళ్లాం పం॥సు॥ | 1 8 | ప్రసన్నయాదవము డిటో | 0 8 |
| లవకుశ బళ్లారివి డిటో | 1 8 | పారిజాతాపహరణము | 0 8 |
| కన్యాశుల్కము గు॥అ॥ | 1 0 | చతుర చంద్రహాస డిటో | 0 8 |
| శోపనా రాణో॥ సు॥ | 1 4 | పార్వతీపరిణయము డిటో | 0 6 |
| తులసీదేవి ము॥చె॥ | 1 0 | స్వప్నవాసవదత్త డిటో | 1 6 |
| బొబ్బిలియుద్ధము శ్రీ॥ కృ॥ | 1 0 | పాండవ జననము రా॥ నా॥ | 0 10 |
| రసపుత్రవిజయము ఇ॥య॥ | 1 0 | పాండవ ప్రవాసము డిటో | 0 12 |
| రాణా ప్రతాప్ సింగ్ డిటో | 1 0 | పాండవోద్యోగము డిటో | 9 12 |
| భక్త రామదాసు కే॥శి | 1 0 | పాండవ విజయము డిటో | 0 13 |
| రామదాసుబళ్లారి డి॥గో॥ | 1 4 | పాండవాశ్వమేధము డిటో | 0 12 |
| రామదాసు రా॥నా॥ | 1 0 | అహల్యాశాపవిమోచనము | 0 13 |
| చింతామణి కా॥ నా॥ | 1 2 | ద్రౌపదీ వస్త్రాపహరణము | 1 0 |
| చింతామణి చ॥మా॥ | 1 0 | సంపూర్ణ రామాయణము గా॥ కో॥ | 1 4 |
| చింతామణి గా॥ నా॥ | 1 0 | సంపూర్ణ రామాయణము తి॥ న॥ | 1 4 |
| వైరాగ్య చింతామణి బ॥ కో॥ | 1 . | సంపూర్ణ భారతము సి॥-॥ | 1 4 |
| కంఠాభరణము సా॥ ల॥ | 1 0 | మహాభారతము సం॥ శం॥ | 1 4 |
| రాధాకృష్ణ డిటో | 1 0 | సంగీత కృష్ణలీల డిటో | 1 0 |
| సావిత్రి శైలవర్గంవారిచె ప్రకటించేది శ్రీ॥ ॥ | 1 2 | అర్జున ప్రతిజ్ఞ ప్రౌ॥ వెం॥ | 0 12 |
| | | భీమప్రతిజ్ఞ అ॥ శే॥ | 0 12 |
| సత్యహరిశ్చంద్రీయం బ॥ ల॥ | 1 2 | భీష్మప్రతిజ్ఞ క॥ కో॥ | 0 12 |
| బుద్ధిమతీవిలాసము డిటో | 1 0 | మోహినీ రుక్మాంగద డిటో | 0 13 |
| ఉత్తర రాఘవము డిటో | 1 4 | గాంధారీసంయుక్త | 0 8 |
| సాత్రాజితీయము | 0 14 | భక్త కబీర్ కో॥ న॥ | 1 0 |
| మహానంద బ॥గో॥ | 4 6 | పాదుకాపట్టాభిషేకము ద్రో॥ సీ॥ | 0 12 |
| జయంతి జయపాలము | 0 12 | లంకాదహనం | 0 10 |
| వేణీసంహారము వ॥సు॥ | 1 0 | వేశ్యాహితబోధిని డిటో | 1 0 |
| శకుంతల కం॥వీ॥ | 1 0 | వేశ్యామధురం పా॥ I | 1 0 |
| శకుంతల వ॥ సు॥ | 1 0 | డిటో పా॥ II | 0 12 |
| అలీబాబా క్రొత్త నాటకం పో॥రా॥ | 0 12 | డిటో పా॥ III | 0 9 |
| శ్రీరామ పట్టాభిషేకము | 1 0 | సురాపుడ్రోలా జి॥ల॥ | 0 8 |

వలయువారు:— రంగా వెంకటరత్నం, బెజవాడ.

శ్రీ

# సంపూర్ణోత్తర రామాయణము

ఏడంకముల నాటకము.



రామనారాయణకవులు



రంగా వెంకటరత్నంగారిచే

శ్రీ పాండురంగ ముద్రాక్షరశాలయందు

కాపీరైటు

1—0—0

# ఈ నాటకమున వచ్చు పాత్రలు



శ్రీరాముఁడు — అయోధ్యాపురాధీశుఁడు

భరతుఁడు
లక్ష్మణుఁడు } శ్రీరాముని తమ్ములు.
శత్రుఘ్నుఁడు

భద్రుఁడు — వార్తాహారుఁడు.

సుమంత్రుఁడు — రథసారథి.

బ్రాహ్మణుఁడు —

జయవర్మ — రాముని సైన్యమున కధిపతి

కుశుఁడు
లవుఁడు } శ్రీరాముని కుమారులు.

గాలవుఁడు — కుశలవుల సహపాఠి,

వాల్మీకి — ముని.

వసిష్ఠుఁడు — ముని.

దూర్వాసుఁడు — ముని.

యముఁడు —

శంబుకుఁడు — శూద్రతపస్వి.

## స్త్రీలు.

సీత — శ్రీరాముని భార్య;

శారద — చెలికత్తె,



శ్రీ

# సంపూర్ణోత్తర రామాయణము.

## ప్రథమాంకము.



రంగము:—అయోధ్యయందు అంతఃపురోద్యానవనము.

[ ప్రవేశము:—సీత, చెలికత్తెయగు శారద. ]

**శార**—దేవీ! వనవాసమును గూర్చి పూర్తిగఁ జెప్పవైతివి!

**సీత**—చెలీ! ఎంతని చెప్పగలను? ఎంత చెప్పినను తఱుగదు. ఆ రావణుని కృత్యంబులన్నియుఁ దలంచిన నాయొడలు జల్లుమనును. వానిపేరు దలంచిన యిప్పటికిని నాకు భయముకలుగుచునే యున్నది. బాధలు తలఁపునకు వచ్చినచోఁ జింతయుగూడ గలుగుచున్నది.

[ తొందరగా శ్రీరాముఁడు ప్రవేశించును. ]

**శ్రీరా**—

**మ.** అతులప్రాభవధైర్యమూనుచు సము ♦ ద్యద్భూరియుద్ధంబునం
దతిబాహాబలశాలి రావణుని మి ♦ త్రామాత్యభృత్యాది సం
తతితోఁ గూడ వధించి మించి త్రిజగ ♦ త్ప్రఖ్యాతిఁ గొన్నట్టి యం
చితసాకేతపురాధినాథగృహిణీ ♦ చింతింప నీకేటికే?

(సీతను సమీపించి) కాంతా ! భవదర్థమై నాచేఁ గూల్చబడిన దశకంఠుఁడు మరల నెట్లువచ్చెను ? నీకు భయకారణమేటిది, చెప్పుము. వాని నిప్పుడే వధించి నీ భయంబు బాపెదనుగాక ! (తొందరపడుచున్నాఁడు.)

సీత—ప్రాణేశ్వరా! తొందరపడవలదు. నీచేఁ గూల్చబడిన యా దశకంఠుఁ డెట్లువచ్చును ? ప్రసంగవశమున వాని నామమును జెలికత్తెతోఁ జెప్పితిని.

శ్రీరా—అదియా సంగతి !

శార—(నెమ్మదిగా నిష్క్రమించుచున్నది.)

శ్రీరా—రమణిశిరోమణీ ! నేను నీ వనవిహారమునకు భంగము మొదవఁ జేసితిఁగదా ?

సీత—నాథా ! ఎంతమాట సెలవిచ్చితిరి ? నీ వరుదెంచుట నా వనవిహారమునకు భంగమా !

తే. గీ. ఘనుని గనఁగ నెంచును చాత • కంబు ; ద్యుమణిఁ
గాంచఁగోరుచునుండు జ • క్రంబు ; శశిని
వల చకోరంబు తిలకింపఁ • దలఁచుచుండు
నట్లు నీమీఁద నా చిత్త • మమరియుండు.

నిన్ను జూడని దినమునాకు దుర్దినము.

శ్రీరా—అన్నులమిన్నా ! నీ హృదయము నే నెఱుంగనా ?

సీ. తండ్రియానతి దాల్చి • తపసివేషముబూని
కాననంబుల కేగు • కాలమందు
నను బాయఁగాలేక • ఘన భాగ్యభోగముల్
విడనాడి, ప్రేమ నా • వెంటవచ్చి
మత్పాదాంబుజసేవ • మహిత సౌఖ్యప్రద
మంచును మదిలోన • నెంచి ; యచట

పడరాని కష్టముల్ ♦ పడి ; దశకంఠుచేఁ
జెఱబెట్టఁగాఁబడి ♦ చిత్తమందు

తే. గీ. నధిక దుఃఖంబు నందుచు ♦ ననవరతము
నన్నె మదిలోన నెంచుచు ♦ నాతిఖిన్న
కాలముఁ గడిపితివి లం ♦ కాపురమునఁ
దెలియదా నాకు నీమది ♦ జలరుహాక్షి !

అరణ్యవాసమున నాతో నెన్నియిడుములఁబడితివి. ఆకష్టములన్నియు దీరినవి. ఆ దినములు గడచినవి.

తే. గీ. శుభదినంబులు చేకూరె ♦ జూచినావె
గర్భవతివైతి; వింక నిక్ష్వాకువంశ
వర్ధనుండగు పుత్త్రునిఁ ♦ బడయఁగలవు
నీకుఁగలకోర్కెఁ దెలుపుమీ ♦ నీలవేణి !

గర్భవతివైయున్న నీకోరికలఁదీర్పవలయునని గురుజనంబులు గూడ నా కాజ్ఞాపించియున్నారు

సీత—సాక్షాద్రమానాథుఁడవగు నీవు నాకు భర్తవైతివి. నీకృపయే చాలును. అయినను నీవడిగితివిగానఁ జెప్పెదను. గంగాతీరారణ్యమున నున్న మునిపత్నులం గలసి యొక్కదినముండఁగోర్కె జనించినది.

శ్రీరా—రమణీమణీ ! ఇదియేకదా నీకోరిక . రేపో, మాపో, లక్ష్మణుని దోడిచ్చి పంపించెదనుగాక ! (ఇంచుక యూరకుండి) ప్రాణేశ్వరీ ! మన మా ప్రాంతమున నించుకసేపు విహరించి పిదప గృహంబునకుఁ బోవుదము రమ్ము.

[అనుబంధము 1.]

(నిష్క్రమించుచున్నారు.)



రంగము:—అయోధ్యయందు చాకలివీధి.

[ప్రవేశము:—ఎల్లియు, వెంకడు.]

ఎల్లి—(తొందరగా ప్రవేశము) నాను సెప్పుమాటలూకొట్టిందె కొడ్తా వుయేంటి ?

వెంక—యేంటి నువ్వుసెప్పేమాట ? నీయమ్మాసిగ్గొయ్య ! యీలాంటి పనులు సేస్తూ నాకొంప తీస్తున్నావు. ఆడెవడే నీతో చరచాలాడుతుంటాడు ? ఆడిపేరుసెప్పు, తల తెగుగుతాను.

ఎల్లి—ఆడెవడో యెవరికితెలుస్తాది. దారీపోయెవాడెవడో నాతో రహచ్చాలాడాడంటావు?

వెంక.—ఆడుమాట్లాడలే? [అనుబంధము 2.)

ఇన్నాళ్ళనుంచి యేమోఅనుకోన్నాను. నీ చంగతి యిన్నాల తెల్సింది. ఆ డెవడు నీతో మాట్లాడడానికి, ఆడిజిమ్మతియ్యా యిల్లాటి ఛాండాలముండవు నాకొంపలో వుండొద్దు పో. నీ. దిక్కుండసోట సెప్పుకో. (కొట్టును)

ఎల్లి—నగాపెట్టిరచ్చించేవాడికిమల్లె కొట్టుతావు.

[భద్రుడు—ప్రవేశము ]

భద్రు—(తనలో) ఏమి ! ఈచాకలి తనభార్యను నడివీధియందు, గొట్టుచున్నాడు. పోయి వారింతునా ! (ఆలోచించి) భార్యాభర్తల కలహమునం దితరులుప్రవేశించుట తప్పని పెద్దలు చెప్పుదురు. అయినను నీ చాకలిదానిం జూచిన నాకు మిగుల జాలికలుగుచున్నది నెమ్మదిగా వానిని సమీపించి వారించెద గాక. (చాకలివానిని సమీపించి) ఓరీ నీకు భార్యయే యగుగాక ఏల యితగా గొట్టెదవు నడివీధియందిట్లు పోరాడుట తగదు.

**వెంక**—నువ్వెవరయ్యా? ఆలీమొగోళ్ళు కొట్టుకుంటారు. తిట్టు కుంటారు. మద్దెనీకేల? యీలాటి తప్పుడుపనులు చేస్తే పోవరూరుకొంటారు? పెళ్ళిసేసుకొన్న నేనుండగా యీముండ కక్కుర్తి పనులు సేస్తుంది చిగ్గుచరంలేక? (కొట్టును.)

**ఎల్లి**—ఇదుగో! ఇదుగో! నన్ను కొట్టొద్దు, పెద్దమన్సులతో సెప్తాను! కూడేత్తున్నాంకదా అని కొడ్తే పడ్తాననుకొన్నావా యేంటి

[అనుబంధము. 3.]

**వెంక**—ఓసిముండా! ఎదిరిత్తుండావ్! నువ్వు నాకొంపలోనుంచి యెళ్ళిపో. ఇదేం శ్రీరాముడనుకొన్నావా యేంటి, రావణాసురుడు యెత్తుకొనియెల్లి లంకలో యేడాదుంచుకొన్న సీతను మళ్ళి తెచ్చుకొని కాపరంచెయ్యడానికి? పోముండా—పో. నువ్వు పోతే యింకొత్తి. (కొట్టబోవగా ఎల్లినిష్క్రమించును. వెంట, వెంకడుగూడ బోవును.)

**భద్రు**—(తనలో)ఆహా! ఈరజకుల కలహంబున శ్రీరాముని సంగతి కూడ వచ్చినదే. నేనీ వీధిని సిప్పుడేలవచ్చితిని? ఇయ్యది శ్రీరామునకుం జెప్పకతప్పదే.

చ. పురమున నుండు వార్తలను ♦ బొందుగ నారసి రమ్మటంచు, భూ
వరుడిటులేలపంపె, నను ♦ బంపెనగాక, మఱొక్కవీధికే
నరుగక యేల యిమ్మెయిడకు ♦ నక్కట వచ్చితి; చాకివాండ్రు నే
నరయగనేం, వీరిమదు ♦ లందున జానకి యేల రావలెన్?

శ్రీరామచంద్రుడు నన్నుజూచి పురమున విశేషములేమని యడిగి నప్పుడు నేనీ సంగతి నెట్లుజెప్పుదును? చెప్పక యూరకుంటినేని యాతని కెట్లయినం దెలియకమానదు. నేనీవార్తం జెప్పినచో రామునకుం బరితాపము గలిగితీరును. ఎట్లుచేయుటకును దోచకున్నది. ఏమైననేమి చెప్పకతప్పదు. (నిష్క్రమించును)

---

రంగము:—సభాభవనము.

[శ్రీరాముడును, భద్రుడును, ప్రవేశము]

శ్రీరా—భద్రా! పురంబునగల విశేషములు జెప్పుటకు నేడేల సంశయించెదవు? నేను వినగూడని వార్తలేమైనఁ గలవా?

భద్రు—దేవా! నీ పరిపాలన సర్వవిధంబుల సౌఖ్యంబుగనుండెనని జనులు కడు సంతసించుచున్నారు. ఎవ్వనినోట జూచినను శ్రీరామరాజ్యమా చంద్రతారకముగ నర్థిల్లవలయుననియే వినవచ్చుచున్నది.

శ్రీరా—భద్రా! ఈమాటలకేమి? ధరాతలపరిపాలనాభారము మిగుల కష్టము బింత ప్రయత్నించనను నేదియేని కొంతగల్లుచునే యుండును దానికేమి! నీ వేదియో విశేషముండు వార్తనే వినియుంటివి ద్దాని వినిపించుటకు సందియమందుచున్నాడని నాకు తోచుచున్నది.

తే. గీ. మంచిదైనను గాకున్న ♦ మనుజవిభుఁడు
పురమునందున్న వార్తల ♦ నరసి ప్రజల
చిత్తవృత్తులఁగన్గొని ♦ చెలఁగవలయు
సంశయించెద నేటికి ♦ సరఁగ జెపుమ.

ఒకవేళ ప్రజలు నావిషయమై యేదేని జెప్పుకొనుచుండుదురుగాక. అట్టిది నీవు నాకుఁ దప్పక వినిపించితీరవలయును.

భద్రు—(తనలో) ఆహా! ఈతఁడు నొక్కినొక్కి యడుగుచున్నాడు నేనేమి సేయుదును నేను విన్న వార్త యీతనికి దెలిసినతో నీతనిచిత్తమున సంతాపము గలుగఁజేసినవాడ నగుదును. (ప్రకాశముగా) దేవా! పలువురు పలుతెఱంగుల జెప్పుకొనుచుందురు. నేనువిన్నవిశేషము రాజ్యపరిపాలన సంబంధమైనదికాదు నీవు వినఁదగినదియుఁగాదు.

శ్రీరా—అట్లయిన నయ్యది యేదో విశేషమైన వార్తయే ! అది యుంగాక యిది నా విషయమై యుండును. నా ప్రాల వచించుటకు నీవు సంశయించుచున్నావు. నీ వట్టి సంశయం బును విడువుము.

భద్రు—మహారాజా ? నేడు నేను విన్న విశేషము నీకు మనోవేదన గలించునని సంశయించుచున్నాను.

శ్రీరా—చెప్పినసందడు, చెప్పకున్న నో మనోవేదనయే !

భద్రు—(తనలో) ఇంక జెప్పకతప్పదు (ప్రకాశముగా) దేవా ! ఏ మని చెప్పుదును ? నేడు చాకలివీధిం బోవుచుండ, నయ్యెడ భార్యాభర్తలు చాకలివాండ్రు పోరాడుచుండిరి.

శ్రీరా—దాని కేమి ! ప్రతిసంసారమున నిట్టికలహములు సాధారణ ముగ గలుగుచునే యుండును. ఇదియుంగాక ప్రతిమానవు నకును నేదేని యొక చింతయుండితీరును.

మ. అమలాంగిం గొనియుంట చింత; మఱి సం • తానాగమంబుచింత; సౌ ఖ్యములేకుండిన చింత; యెంతయును బా • ధ్యంబుండినం జింత, కూ టమి హెచ్చైన భరింపజింత: యెటులుబో • దేగ ఘోరసంసారకూ పమ్మునం మునిగినవారికెల్ల నిది సం • ప్రాప్తించు నుర్వీస్థలిన్.

అట్టి భార్యాభర్తల కలహంబులంటివా, వీనింగూర్చి విశేషముగ జెప్పనక్కఱలేదు.

సీ. తరుణోడి సతులకు • ఘన భూషణములుంటె
దనకు లేవని చెప్పు • వనటగుందు
తనవారువచ్చిన • ఘనముగా జూడలే
దని మదిం దలంచి క • య్యంబులాడు
నమితశయనంబును • నార్జింపలేదంచు
నెప్పుడుజూచినం • జెప్పుచుండు

చీటికిమాటికిఁ ♦ జీకాకుఁజూపుచు
నే నెపంబునొ, కల ♦ హించుచుండు

తే. గీ. నిట్టివేకదా జగంబున ♦ నింతులందు
సహజమైన గుణములు; క ♦ లహమునకును
నివియొకాదె కారణము వే ♦ రేమికలదు ;
కలహముండని కొంపయే ♦ కానరాదు.

ఆ రజకుల కలహంబున నీ వేమైన విశేషము నారసితివా ?

భద్రు—రామచంద్రా! ఈ దీనుని నోటితోఁ జెప్పక తప్పదయ్యెను. ఆ రజకుఁడు తన భార్యను గొట్టుచు " నేను నిన్నేలుటకు " రావణునిచే గొనిపోఁబడి, యొక సంవత్సరము లంకయం దుంచబడిన సీతను మరలఁదెచ్చుకొని యేలుటకు శ్రీరాముఁడను గా" నని పలికెను.

శ్రీరా—(తనలో) ఆహా ! ఎట్టి దారుణవాక్యమువింటిని !

చ. దనుజుఁడు గొంచుబోయి కడు ♦ ధైర్యముతోఁ దనపట్టణంబునం
దునిచిన సీతఁ దెచ్చుకొని ♦ నృపు గయొనేలుచునుండె రామ భూ
జనపతియంచు నెల్లప్రజ ♦ చాటుచునుండఁగ నింకనెట్లు నే,
మనఁగల నిందఁబొందుచును ♦ మన్కిలమందునఁ దోచదయ్యెడిన్

రావణవధానంతరంబున, సీత మహాసాధ్వి యని యగ్నిహోత్రుఁడు చెప్పినంగదా నే నామెను గ్రహించితిని. ఇప్పుడు నేనేమి సేయుదును ? దుర్యశంబంది జీవించుటకన్న మరణమే మేలుగదా ! నే నెట్టయిన నీ నిందను బాపుకొనవలయును.

భద్రు—(తనలో) ఈ మాటవినగానే రాముడు దీర్ఘాలోచనాయత్తుఁడైనాఁడు, ఈతని హృదయమునఁ జింత ప్రవేశించినది. తుదకిది యెట్లుమారునో తెలియకున్నది. (ప్రకాశముగా)

రామనరపాలా! సురాపానమత్తచిత్తుఁడై యొడలు దెలియక నిన్నుఁగూర్చి యట్లుప్రేలిన యారజకుని శిక్షింపవలయును.

శ్రీరా — భద్రా! నీ వెంత వెఱ్ఱివాఁడవు! ఆ రజకుఁ డేమి చేసెను అకారణముగా వాని నేల శిక్షింపవలయును? లోక మనేక విధములఁ జెప్పుకొనుచుండును. ప్రజలను కడుఁ బ్రేమతో నరయవలయుఁగాని శిక్షింపరాదు.

మ. ధరణీభారము నిర్వహించు నతఁడా ♦ త్మక్షోణిలో నందఱన్
కరుణాయత్తమనంబుతో నరయుచున్ ♦ గాపాడుటన్ మాని, ని
ష్కారుణన్ రాజ్యమదాంధవృత్తిఁ బ్రజలన్ ♦ గారింపగాఁ జెల్లద
క్కారణం జేసిన ధర్మహానియుఁదిర ♦ స్కారంబు గాకుండునే?

(ఇంచుక యూరకుండి) నీవరిగి నా యాజ్ఞగాఁ దెలిపి తమ్ములను దోడ్కొనిరమ్ము.

భద్రు — చిత్తము (నిష్క్రమించును.)

శ్రీరా — (తనలో) అక్కటా! నే నెట్టినిందకుఁ బాలైతిని! ఈ యపవాదుఁ బాపుకొనుటకు నేనేమిచేయుదును? (ఆలోచించి) చేయుట కేమున్నది! సీతను బరిత్యజించుటయే కర్తవ్యము. (ఆలోచించి) హా! సీతను బరిత్యజించుటయా? ఎంతకష్టము!

సీ. ననుఁ బాయఁగాలేక ♦ నావెంట వనవాస
మును జేయ వచ్చిన ♦ పొలఁతిమిన్న
ప్రాణేశుసేవయే ♦ పరమసౌఖ్యమటంచు
భావించి మించిన ♦ పరమసాధ్వి
ననుబాసి లంకలో ♦ వనట నుందుచుఁ బ్రాణ
ములఁ దాల్చియుండిన ♦ పూజ్యచరిత
ఘనసాధ్వియంచును ♦ వహ్నిచేతను సాక్ష్య
మిప్పించియొప్పిన ♦ మెఱుగుఁబోడి

తే. గీ, ఆట్టిసకలసద్గుణశీల • యైన సీత
నాదుప్రియకాంత నీ యప • వాదకొఱకు
విడిచి జీవింపగలఁనె నే • బుడమియందుఁ
గటకటా! యెంత గష్టంబు • కలిగె నాకు!

అమెను బరిత్యజింపక యుంటినేని నా యపవాదము దీరలేక యుండును. (విచారించుచున్నాడు)

(ప్రవేశము లక్ష్మణ భరత శత్రుఘ్నులు.)

భర—(తమ్ములఁ జూచి) తమ్ములారా! సకల నింతరొంతగా నగ్రజుఁడు రావించుటకుఁ గారణ మేమై యుండునో కదా

లక్ష్మ—ఏదియో యొక విశేష ముండితీరును.

శత్రు—ఇదుగో! రామచంద్రుఁ డొంటిగనున్నవాడు.

భర—(పరికించి) ఏమిదీ! అగ్రజుఁడు నేఁ డిట్లున్నవాఁడు!

తే. గీ. పూర్ణచంద్రునిబోలు న • మోమ్మము నేఁడు
కాంతి తగ్గియున్న దదేమి • కారణంబొ
చిత్తమెంతయు వికలతఁ జెందియున్న
కరణి, దోచుచున్న దికతం • బరయవలయు

లక్ష్మ—అవును. ఈతఁడు దీర్ఘవిచారతత్పరుఁడై యున్నట్లుదోచెడి.

శత్రు—అన్నలారా! ఇప్పుడే మన కంతయుఁ దెలియునుగదా! అగ్రజుని సమీపింతముగాక

ముగ్గురును శ్రీరాముని సమీపించుచున్నారు

శ్రీరా—(తమ్ములనుజూచి) తమ్ములారా! వచ్చితిరా! ఇటుఁ గూర్చుండుఁడు.

(అందఱును నాసీనులగుదురు.)

లక్ష్మ—(శ్రీరాముని జూచి) అగ్రజా!

చ. జనకుని సత్యశాసనము ♦ సమ్మతిఁ బాలనసేయఁ గోరి, యీ
వ్వనములకు నేగునాఁడయిన ♦ భావమునందునఁ జింతయింతయుఁ గ
గనఁబడదేమికారణమొ ♦ కానఁగవచ్చెను నీదు మోమునన్
ఘనమగు చింత నేఁడు, వివ ♦ రానగునేని వచింతువే కృపన్.

భర—అన్నయ్యా! నిత్యసంతోషివై యుండు నీకు నేఁడేల చింతకలిగెను?

శత్రు—అగ్రజా! నీ విచారమునకు గారణమేమి?

శ్రీరా—తమ్ములారా! అపవాదనందిన మనుజునకుఁ జింతగాక సంతోష మెట్లుండును?

భర—అట్టియపవాద నీకేమివచ్చినది?

శ్రీరా—వచ్చుటచేతనే యింత చింతకుఁ బాల్పడితిని.

భర—ఏమీ! నీకే యపవాదవచ్చినదా?

సీ. జనులెప్డు నిజకులా ♦ చారముల్ దప్పక
భవ్యమతులగుచుఁ ♦ బరగుచుండ్రి
కలుషబాధలులేక ♦ నిరతంబు రాజ్యంబు
నడచున్న ప్రజవృద్ధి ♦ నడచుచుండె
వర్షక్రమంబు వ ♦ ప్పక రాజ్యమంతయుఁ
బాడిపంటలతోడఁ ♦ బ్రబలుచుండె
ధర్మమార్గాను వ ♦ ర్తను వ్యాపార మ
త్యంత హా వృద్ధితో ♦ నలరుచుండె

తే. గీ. రామరాజ్య మాచంద్ర తా ♦ రకము ధరణి
వర్ధిలుంగాక యంచును ♦ ప్రజలుముదము
లందుచున్నార లట్టిచో ♦ నపయశంబు
గలుగుటెందుకు నీకును ♦ లలితచరిత!

లక్ష్మ—సీ. చిన్నారి పొన్నారి ♦ చిరుతకూకటినాఁడు
గాధేయుయాగంబు ♦ గాచినావు
పదరజంబుఁ బఱపి ♦ పాషాణమైన ము
నీంద్రుసతినిఁ గృప ♦ నేలినావు
క్షత్రియాంతకుడును ♦ శౌర్యశాలియు నైన,
పరశురాముని భంగ ♦ పఱచినావు
ఖరదూషణాదుల ఖండించి ♦ వనవాస
తాపసులకు భీతిఁ ♦ బాపినావు

తే గీ. యొక్కకోలనె వాలిని ♦ నొంచినావు
నిఖిలదిక్తటకీర్తిని ♦ నించినావు
దుర్యశంబేమి ! నీకేమి ! ♦ తోచదయ్యె
రవికులాంభోధిసోమ ! శ్రీ ♦ రామనామ !

మ సమరక్షోణితలంబునన్ దశముఖున్ ♦ శౌర్యంబు కీపింప, దు
ర్గమ దోర్దండ పరాక్రమంబున వెసన్ ♦ దర్పంబు దూలించి;యు
య్యమగ శ్రేణికి గూర్చి మోదము; ♦ సము ద్యత్కీర్తినార్జించినా
వు;మహాత్మా!యిపుడేలదుర్యశమునిన్ ♦ బొందెంగృపందెల్పుమా

శత్రు—సీ. రాజిల్లుచున్నావు ♦ రాజులెల్లరునీదు
పాదపీఠికి దలల్ ♦ వంచిమ్రొక్క
పాలించుచున్నావు ♦ ప్రజలెల్ల తండ్రియే
యంచును మోదంబు ♦ నందునట్లు
కావించుచున్నావు ♦ ఘన ధర్మకార్యముల్
బృందారకులుగూడ ♦ వెఱగునంద
రక్షించుచున్నావు ♦ రహినీకు శరణార్థు
లను లోకమంతయు ♦ వినుతిసేయ

తే. గీ. సకలవిషయములందు, య ♦ శంబుగాంచి
ధర్మమూర్తివటంచును ♦ ధరణియందు
బరగుచుండిన నీ కప ♦ వాద మేమి
యద్భుతముదోఁచెఁ జెప్పుమీ ♦ యవనిపాల.

శ్రీరా—తమ్ముఁగారా ! ఎట్టివాడైననేమి ! నేటి కిట్లపవాద మందితిని లంకానాథుఁడగు రావణుఁడు గొనిపోయి యొక సంవత్సరము లంకయందుంచిన సీతను మరల దెచ్చుకొని రాముఁడేలుచున్నాడని జనులు చెప్పుకొనుచుండిరట. ఇంతకంటె నప వాదమేమి కావలయును ?

లక్ష్మ—(కోపముతో)

ఉ. సీతయొకింతదప్పక, ము ♦ నిప్రవరుల్ గొనియాడ, నాత్మనం
జాతులరీతి స్వప్రజను ♦ సాకుచు, నజ్జనరక్షణంబు, దు
ష్టాతతశిక్షణంబు వెల ♦ యంగను రాజ్యమునేలు రామభూ
జేతను నీగతింబలుకు ♦ నీచుని శీర్షము డొల్లనేయనే.

ఆ ! దురాత్మా! ఎవ్వడవురా నీవు? సుమిత్రాకుమార మహాక్రోధాగ్నినిఁ బ్రజ్వరిల్లఁజేసితివి!

శత్రు—(శ్రీరామునిఁజూచి)

మ. అనుమానంబొకయింతపూనక సము ♦ ద్యత్పుణ్యచారిత్రనిన్
నిను నీరీతిని నిందలంబలుకు నా ♦ నీచాత్ము శీర్షంబు మ
ద్ఘనఖడ్గంబున ముక్కముక్కలుగ వే ♦ ఖండించివైతున్ , మనం
బున సంతాపముమానుమయ్య ! యనుజా ♦ భూపాలచూడామణీ!

పూతచరిత్రయు, జగన్మాతయు నగు సీతను నెవ్వడీరీతిని సాహసముగాని పలికెనో యా దురాత్ముని సైరింతునే ?

భర—(కోపముతో)

చ. ఎవడవురా దురాత్మ ! మది ♦ నింతయు భీతినిఁ బూనకుండ; భూ
ధవుని నిజాంగనన్, సతల ♦ ధర్మచరిత్రి, సుశీల, సాధ్వి, స
ద్భవిసుతగతింబలుకఁ ♦ బోటునె సాహసలీలలు, చూతుమింకని
న్నవిరళ విశ్రమంబునను ♦ నాజినిగూల్చెద దుర్మదాధమా !

(రాముని జూచి) రామచంద్రా ! లోకమాతయగు సీత నీతి
నాడిన దురాత్ముని నా ఖడ్గరాజమునకు బలియొసంగి తీరెదను.

శ్రీరా—తమ్ములారా ! శాంతింపుడు. మీకోప మెవ్వరిపై జూపుదు
రు! మతము నోరుమూసికొనవచ్చునుగాని లోకము నెట్లు
మూయగలము ? (ఇంచుక యూరకుండి) మీరే నాకుఁ జుట్ట
ములును, సఖులును, ధనమును, ప్రాణంబులు నైయున్నారు.
మీరే నన్ను భక్తివిశ్వాసములతో సేవించుచు నన్ను రాజ్య
ధారేయునిఁగాఁ జేసినారు. అట్టియెడలఁ బ్రతివిషయమును
మీతోఁ జెప్పవలసియున్నది. దానవుఁడు చెఱఁబట్టుకొని
పోయినకాంతను సాధ్వియని తెచ్చుకొని శ్రీరాముఁడేలుచు
న్నాడని జనులాడు వాక్యములు నా హృదయమును నిశి
తోగ్ర బాణములవలె నాటినవి. (లక్ష్మణుని జూచి) తమ్ము
డా ! లక్ష్మణా! మున్ను లంకాపురమందు రావణవధానంత
రంబున సీతను స్వీకరింపనని పలికి, యగ్నిం బ్రవేశింపుమని
నుడువ నామె యట్లొనరించుటయు, దేవతలామెను నుతించు
టయు నీవెఱిగియే యుంటివి. అదియుంగాక, యా సమయ
మున నగ్నిహోత్రుఁడువచ్చి "సీత మహాసాధ్వి"యని పలుక
నేనా మాటలెట్టివలుకులెక్కడ పలుకుదురోయని తలంచియే
నేనామెను నగ్నింబ్రవేశింపఁ జేసితిని. మూఁడులోకములు
ఖ్యాతిఁ బాతివ్రత్యమును
భావింపరైరి. (అందఱిని జూచి) అనుజులార ! దుర్యశమంది
జీవించుటకన్న మరణించుటయే మేలు కావుననిందలోగొట్టు

కొనుటకై సీతను బరిత్యజింపఁ దలంచితిని. సీతయే యననేల? అవసరమగుచో ప్రాణములనైన సంతకన్న నెక్కుడగు మిమ్ములనైన విడిచెదను. సీత సాధ్వియేయగుఁగాక ! లోకాపవాద భీతికై యామెను బరిత్యజించెదను. (ఇంచుక యూరకుండి భరతునిజూచి) భరతా !

తే. గీ. డెందమందున నినుమంత • సందియంబు
పొందక జనకభూపాల • పుత్రినిపుడు
విపినభూములయందున • విడిచి నాకు
మోదమునుగూర్పు మీ,యప • వాద బాయ.

భర— [అనుబంధము 4]

మ. ఎవఁడో పామరుఁడాడు వాక్యముల నీ • వీరీతి నాలింప శ్రీ
యవనీపుత్రినివీడ ధర్మమగునే • యాసాధ్వికిన్ బాములన్
భువిఁగల్పింపఁగ నేలఁ : నీ వెఱుఁగవే • పూబోఁడి సౌశీల్య మో
యవనీపాల కిరీటదీపిత పదా • భ్రాతన్నయా ? రాఘవా !

అగ్రజా ! నేనెప్పుడును నీ యాజ్ఞకు బద్ధుడనై యుండువాడను. పరమ పావన చరిత్రయగు నామెను బరిత్యజించుట ధర్మముగాదని చెప్ప సాహసించినందులకు నన్ను మన్నింపుము.

శ్రీరా— మా రెవ్వరును నా కడ్డుఁగల్పింపవలదు (భరతునిజూచి) భరతా ! నీవు సంశయింపక సీతను గాననంబున విడచిరమ్ము.

భర— రామచంద్రప్రభూ ! నాచిత్తవృత్తి నీకు సంపూర్తిగ దెలియును. ఎప్పుడును నీ యాజ్ఞకు మీరినవాడనుగాను. కాని యీ విషయమును నా చిత్తమొకింత వెనుదీయుచున్నది,

చ. క్షితితలమెల్లఁ బుత్రకుని • చేతను నేలఁగఁ జేయ; జానకీ
పతిని నరణ్యభూములకు • బంపును గైకయటంచువచ్చు, నా

కలిభరమైనసింద ; యది ♦ యట్టులెయుండఁగ ; సీత నిప్పుడే
గలిని వనాళి వీడుదు జ ♦ గంబు హసింపదె రాఘవాగ్రణీ !

దేవా! నేనీకార్యము జేయఁజాలను. నన్నుక్షమింపుము.

శ్రీరా—(శత్రుఘ్నునిఁజూచి)

తే. గీ. చిన్నతమ్ముఁడ ! నీవైన ♦ సీత నెట్లొ
విపినభూములయందున ♦విడిచిరమ్ము
వగ్రజుఁడనైన నేను దు ♦ ర్యశముగనుట
మంచిదా ! మీకు మదిని యో ♦ చించిచూడ.

శత్రు—                                [అనుబంధము 5]

సీ. భూదేవి పుత్రియై ♦ పొలుపొంది, భువి నయో
నిజయనాఁచు నొప్పిన ♦ నీలవేణి
జనకభూపాలు హ ♦ స్తంబుల నతిముద్దు
గాబెరిగినయట్టి ♦ కాంతమిన్న
సాధ్వమణియటంచు ♦ సర్వభక్షకునిచే
బేరంది వెలసిన ♦ విమలమూర్తి
తత్పదాంబుజసేవ ♦ తివ్పనన్యమెరుంగ
క మెలంగుచుండెడి ♦ కమలనయన

తే.గీ. అట్టి పరమపావనశీల ♦ యైనసీత
నెట్లు వనములందున డించి ♦ యేగుదెంతుఁ
జేయజాల నీ కార్యంబు ♦ చేయఁజాల
నన్ను క్షమియింపుమయ్య భూ ♦ నాథ చంద్ర!

అగ్రజా ! ఇట్టి దారుణమైన కార్యమును నేనెట్లుచేయఁగలను?

శ్రీరా—(తనలో) శత్రుఘ్నుఁడుగూడ నామెను నరణ్యములకుఁ గొని
పోవఁజాలనని పలుకుచున్నాఁడు. కల్మషరహితయుఁ బూత
చరిత్రయునగు నామెను లోకాపవాదమునకు భీతిల్లి కఠినమ

తినై విడుచుటకు నేను సమ్మతింపుచుంటిని కాని వీరేల సమ్మతింతురు? కానిమ్ము. లక్ష్మణుండు తప్పక నా యాజ్ఞ పాలించును. (లక్ష్మణునిం జూచి) సౌమిత్రీ! నీవు నాకెంతయు గూర్చు భక్తుండవు, నన్నెడంబాయజాలక సమస్తభాగ్యములను, భాగ్యనువిడచి నావెంట నరణ్యములకరుదెంచి నిద్రాహారములుమాని నన్ను సేవించితివి. ఇప్పుడీ కార్యభారము నీభుజస్కంధమునందుం బెట్టుచుంటిని. సీతను నీ వరణ్యములయందు డించి రావలయును. ఆమె నెట్లుతోడ్కొని పోవుదునా యని నీవు శంకింపవలదు. మీ వదినె గంగానదీతీరంబుననున్న తపోవనంబులంగాంచి, మునికన్యకల దర్శించి రాంగోరిక కలదని నాతో నుడివియున్నది. ఆమెను నీ వానెపంబున రేపు సూర్యోదయమున సుమంత్రిచోదిత రథాధ్యాసీనంగా జేసి భాగీరథీతీరమున వాల్మీకాశ్రమ సమీపమున డించి రమ్ము.

తే, గీ. సీతకునులేదు రాముడు ♦ క్షితిలమున
రామునకులేదు సీత, యా ♦ రాజముఖికి
నాకు ఋణముదీరెను నట్లు ♦ గాకయున్న
వచ్చునే! లక్ష్మణా! యప ♦ వాదనేడు.

లక్ష్మ—(తనలో) అక్కటా? నేనిప్పుడేమి సేయుదును? ఇకార్యము నేను సేయునని వచించితినేని యీ యనఘున కాగ్రహము వచ్చునేమో? ఈతండు నన్నుం దన యాజ్ఞాశృంఖలమున బంధించివైచినాండు. కానిమ్ము నెమ్మదిగా నిట్లు చెప్పిచూచెదగాక! (ప్రకాశముగా)

సీ, ఏకాంతకై నీవు ♦ శ్రీకంఠుచాపంబు,
ఖండించినసత్కీర్తిం ♦ గాంచినావ

ఏ రాముకై నీవు ♦ క్రూరుడైన విరాధు,
నవలీలగా దుంచి ♦ యలరినావో
ఏ లేముకై నీవు ♦ వాలిని నొక్కకోలఁ,
గూల జేసి యినజు ♦ నేలినావో
ఏ యింతికై నీవు ♦ నెల్లలోకములేచు,
దశశిరస్కునిఁ గూల్చి ♦ దనరినావో

తే. గీ. అట్టి ప్రియభామ, గుణశీల ♦ నలఘుచరిత
సాధ్వీలోకైకమాత శ్రీ ♦ జనకపుత్రి
సీతవిడనాడ ధర్మమే ♦ చిత్తమందు
దలఁచిచూడుము నామాట ♦ లలితతేజ!

మ. పదునాల్గేడులు ఘోరమౌ వని వసిం ♦ పం బోవు నీ వెంట స
మ్మదముం బొందుచు వచ్చియెయ్యెడ సుఖంబుం దుఃఖముం జూడకే
పదదాస్యంబొనరించి నీకు త్రిజగ ♦ త్ప్రఖ్యాతినిం గాంచె న
మ్మదిరాక్షీమణి కిట్టిపాట్లు మనలన్ ♦ బ్రాప్తింపగాఁ జూతువే.

మ. అలలంకాపురమందు నయ్యనలు ♦ డాహ్లాదంబుతో వచ్చి; యీ
జలజాతాక్షి సుశీల, సాధ్వియని యి ♦ చ్చంజెప్పడే యట్టిచోఁ
గలకంఠిన్ భవదీయదాస్యకల నా ♦ కామన్ ధరాపుత్రికన్
విడువంబాడియె నీకు రామనృపతీ ♦ వీక్షింపుమా సత్కృపన్.

శ్రీరా — లక్ష్మణా! నీకు నాయందున్న వాత్సల్యమెట్టిదో నేను సంపూర్ణముగ నెరింగియుంటియే నిన్ను కార్యమున నియోగించితిని. మీవదినపై నున్న ప్రేమచే నట్లు పలుకుచుంటివి. నీవు నా మాటల కన్యథా పలుకకుము. నేనామెను లోకాపవాదం బాపుకొనుటకై పరిత్యజించుచున్నాడను.

ఉ. కానము దాజ్ఞపైన జన ♦ క ప్రభుకూతురు సీత నెట్టులో
కాననభూములన్ విడచి ♦ గ్రక్కునవచ్చి ముదీయకీర్తి భూ

జానులయందు నిల్పునటు నమస్కార జేయఁగ నయ్యా తమ్ముఁడా
మానసమందుఁ జేర్చ కను నూనము కింతయుఁ బొమ్ము పొమ్మికన్

(భరత శత్రుఘ్నులను జూచి) తమ్ములారా ! రండు

[శ్రీరాముడు భరత శత్రుఘ్నులతో నిష్క్రమించును]

**లక్ష్మ**—(తనలో) ఇప్పుడు నేను శ్రీరాముని యాజ్ఞ ననుసరించి తీర వలయును. ఇక నేను సీతా మహాదేవిని గానలంబులయందు విడచిరాక తప్పదు. (సీత నుద్దేశించి) హా! సీతా! పరమపావన చరితా! నీవు పుట్టినయింట నేమి సౌఖ్యంబుగాంచితివో గాని మెట్టినయింట మాత్రము సుఖమన్నమాట యెఱుంగవైతివి. నీ జీవయాత్రయంతయు విపినములయందే గడపుమని బ్రహ్మ వ్రాసెను కాబోలు ! (యించుక యూరకుండి) ఇంక నేనువిచారించి నంతవలనఁ బ్రయోజనము లేదు. (ప్రక్కంజూచి) సేవకా !

**సేవ**—(ప్రవేశించి) ఏమి సెలవు ?

**లక్ష్మ**—నీవరగి సుమంత్రుని నా మందిరమునకు రమ్మని నా మాటగాఁ జెప్పుము.

**సేవ**—చిత్తము. (నిష్క్రమించును.)

**లక్ష్మ**—ఆహా ! నేనెంతదారుణమైన కార్యము జేయవలసివచ్చినది !

(అనుబంధము 6) (నిష్క్రమించును.)

ఇది ప్రథమాంకము.





శ్రీ

# సంపూర్ణోత్తర రామాయణము

## ద్వితీయాంకము.



రంగము:—అరణ్యము.

ప్రవేశము:—రథముపై లక్ష్మణుఁడు-సీత-సుమంతుఁడు.

**సీత**—(తనలో) అక్కటా! ఏమి కారణమోగాని నా మనంబంతయుఁ గలఁతఁజెందుచున్నది. గృహము విడిచినది మొదలుకొని నాకన్నియు నపశకునములే యగుచున్నవి. (లక్ష్మణునిజూచి) లక్ష్మణా! మనకన్నియు నపశకునములే యగుచున్నవేమి? నాచిత్తమున నదియొక విధమగు భయము కలుగుచున్నది.

సుమం—(తనలో) సామాన్యముగ ముందువచ్చు నపాయము సూచించుటకు దుర్నిమిత్తములు దోఁచుచుండుటయో, లేక చిత్తమున సంతాపములు గలుగుచుండుటయో సంభవించుచుండును.

లక్ష్మ—(తనలో) రామాజ్ఞంగొని కఠినచిత్తుఁడనై యీమె నీ ఘోరారణ్యమునకు జేర్చితిని.

ఉ. కాననభూమియందు నినుఁ ♦ గ్రక్కున వీడుమటంచు రామభూ
జాని యనుజ్ఞనిచ్చెనని ♦ చానకునెట్లువచింతు; జెప్పినన్
మానసమందు ధైర్యమును ♦ మాత్రము బూనక చింతనొంది యీ
జానకి యేమిసేయునొకో ♦ సాహసమూనుచుఁ దోఁచదయ్యెడిన్.

ఇప్పుడు నే నీమె కెట్లు వచింపఁగలను ? (ప్రకాశముగా) అమ్మా! ఈ యపశకునములు మనల నేమి సేయఁగలవు ?

సీత—నీవు చెప్పినమాట నిశ్చయమే. తాపసకన్యల దర్శించి నేఁ దెచ్చిన భూషణాంబరములు వారికొసంగి మన మిప్పుడే పురంబునకు మరలిపోవుదము.

చ. ధరణితలేంద్రు నానతిసిఁ ♦ దద్దయుఁబూని ప్రశస్తభూషణాం
బరములు తాపసోత్తముల ♦ పత్నుల కీయఁగ బోవుచుంటి; నీ
వరయఁగ వెంటనుంటివి, శుభాస్పదకార్యముగాదె చేయఁగా
మరఁది ! తలంచినా నిపుడు ♦ మానసమందున భీతియేటికిన్ ?

లక్ష్మణా! ఇప్పుడు మనము వాల్మీకాశ్రమమునకే పోవుచుంటిమా?

లక్ష్మ—(తనలో) నే నీమె కేమని చెప్పుదును? ఆ కనిపించు మార్గము వాల్మీకాశ్రమమునకే పోవును. కాని యీమెను నే నిప్పుడు గంగాతీరమునకుఁ జేర్చి యచ్చట విడచెదఁగాక. ఆ సమీపమునందే వాల్మీకాశ్రమమున్నది. (సుమంత్రునిఁజూచి) సుమంత్రా రథమును త్వరగా నడిపింపుము.

సీత—సౌమిత్రీ! నామనంబున సంతాప మంతకంత కధికమగుచున్నది

సీ. కరుణయింతయు లేక ♦ కైకమ్మ మనలను
అడవికిఁ బంపించు ♦ నప్పుడైన
మాయాకురంగంబు ♦ మనలను వంచించి,
నాత్మేశు నెడబాపి ♦ నప్పుడైన
తపసివేషముతోడ ♦ దశశిరస్కుఁడువచ్చి
వేగ నన్గొనిపోవు ♦ వేళనైన
లంకాపురమున ని ♦ శ్శంకతో దైత్యకాం
తలు తన్ను బాధించు ♦ తరినినైన

తే. గీ. నెత్తిగియుండని చింత నే ♦ డేమొగాని
కలుగుచున్నది మదిలోన ♦ లలితచరిత !
కారణం బిసుమంతయుఁ ♦ గానరాదు
మరలిపోదమా నగరికి ♦ మరది ! యిపుడు.

ఇట్టి మనోవికారము మున్నెన్నఁడును నెత్తిగియుండను. మార్గమున మనకన్నియు దుశ్శకునములే యైనవి. ఇదియంతయుఁ జూడ నా మనంబున దిగులుపుట్టుచున్నది. జగంబంతయు నంధకారముతో గప్పఁబడినట్లు తోచుచున్నది. నాకేమియుఁ దోచకున్నది. నా మనోహరుఁడగు శ్రీరామచంద్రుని విడిచి వనంబులయందుండు మునిపత్నుల నేలజూడ గోరితిని? పోనిమ్ము. కాంతలు హితాహితచింతలు లేనివారని తలంచి నన్ను వారింపక యమ్మహాత్ముఁడు నా యభీష్టము దీర్చుట కేలసమ్మతించెను? సౌమిత్రీ! ప్రాణేశ్వరుఁడు నన్నుఁ గాంచి "నీ మనంబున నెట్టికోరిక కలదో తెలుపు" మని యడిగినప్పుడు పదునాల్గువత్సరము లరణ్యంబున మెలంగినది చాలక, మరల నిట్టి కోరికనే యేల గోరితిని? మరల నేమి కీడు ఘటిల్లునో కదా! అన్నియు నపశకునములే! వీని వలన రామభూపాలునకును, నత్తలకును, మఱదులకును, మఱదండ్రకును నెట్టి యాపదలును గలుగకుండుఁగాక!

లక్ష్మ—(తనలో) నిరంతరమును శ్రీరామచరణసాన్నిధ్యమున మెలంగు నీమె విధికృతమున నాకీ సేవ నెడబాయవలసి వచ్చెను గదా! ఇదిగో! గంగాతీరమును జేరుకొంటిమి. ఆవలితీరంబున నీమెను విడువవలయును. (ప్రకాశముగా) తల్లీ! నీవేమియు దిగులునందఁ బనిలేదు. నీవు మునిపత్నులను జూచిన తరువాత సత్వరముగనే మనము పురమున కేగవచ్చును.

సీత—లక్ష్మణా! మనము గంగాతీరమునకు వచ్చినాము ఆహా ఇది నేత్రపర్వం బొనరించుచున్నది. ఈ స్రవంతిని, జూచినంతనె నా సంతాపము పోయినది.

లక్ష్మ—(తనలో) ఆహా ! ఈమె యెంత యమాయకురాలు! గంగను జూచి సంతసించుచున్నది. నే నిక్కడ రథంబునాపి యీమెను గంగను దాటించి విడువవలయును. అకటా! యీమెను నేనెట్లు విడువగలను! లోకాపవాదకు భీతిల్లి నీ మనోహరుఁడు నినుఁ గాననంబులయందు డించిరమ్మని నాకుఁ దెల్పెనని సంపూర్ణ గర్భవతియగు నీమెతో నెట్లు చెప్పగలను! నేనెంత కఠినచిత్తుఁడను ! ఆ రామచంద్రుఁ డిట్టికార్యము సేయుటకు నన్నే యేల నియోగించెను.

తే. గీ. ఈమె పరిపూర్ణ గర్భిణి • యెట్లు ఘోర
కాననంబుల విడనాడ • గలుగువాఁడ
(ఇంచుక యూరకుండి)
పాపకార్యము సేయంగ • బాలుపడిన
నాకు సద్గతి కలుగునే • లోకమందు ?

ఏమైననేమి ! శ్రీరామునియాజ్ఞ తప్పదుకదా, (విచారించుచున్నాఁడు)

సీత—(లక్ష్మణునిఁజూచి) మఱదీ ! నిముషములో నీ ముఖంబునందున్న కళ మారిపోయినదేమి ! నీ వెందులకోగాని చింతనందు మున్నట్లుంటివి.

సీ. హిమాచలమునుండి • యింపార జనుదెంచి
భాగీరథియనెడు • భవ్యనామ
మునుధరియించి యి • వ్వుడమిపై శోభిల్లె,
భోగవతియటంచు • బొలుపొందె
పాతాళమందున • పరసిద్ధసాధ్యయ
చ్చరముని సేవ్యమై సత్పథమున
మందాకినియను నా • మంబున రాణిల్లె,
నల పార్వతీశు జ • టాగ్రభాగ

తే. గీ. మందుధరియింపఁగాఁబడి ♦ యఖిలలోక
సేవ్యమైనట్టి గంగ నీ ♦ క్షించి, ముదము
నందక విచార మీరీతి ♦ డెందమందు
నందె దేటికిఁ జెప్పుమీ ♦ యమలచరిత!

లక్ష్మ—తల్లీ! ఎండయందు వచ్చుటంజేసి నా మొగం బించుక వాడి యుండును. అంతకంటె మరేమియుఁ గారణములేదు. ఇదిగో! మన మిప్పుడీ గంగానదినిదాటి యావలకుఁ బోదము. (సుమంత్రునిఁజూచి) సుమంత్రా! నీవు రథముతో నిచ్చటనుండుము. మేము గంగదాట మునిపత్నుల సందర్శించి వచ్చెదము.

సుమం—(తనలో) అక్కటా! ఎంతకష్టము! ఇంక లక్ష్మణుండీమెను నావలితీరమున విడిచివచ్చును.

చ. ధరణికుమారియై దశర ♦ థక్షితిపాలుని పెద్దకోడలై
పరమగుణాఢ్యుఁడైన రఘు ♦ వర్యునకెంతయు గూర్చుభార్యయై
వరమణిసౌధరాజముల ♦ వాసముజేయుచునుండు నీమె కీ
కరణి విధాత వ్రాసెఁగద ♦ కాననభూముల నుండునట్లుగన్.

(ప్రకాశముగా) లక్ష్మణా! రథంబును నే నా వటవిటపిక్రింద నాపు కొని యుండును.)

సీతయు, లక్ష్మణుండును, రథముదిగఁగా సుమంత్రుఁడు రథముతో నిష్క్రమించును]

లక్ష్మ—(సీతంజూచి) అమ్మా! గంగదాటుటకు నావ యచ్చట సిద్ధముగ నున్నది. రమ్మా.

(ఇరువురు నిష్క్రమింతురు.)



రంగము:—గంగాతీరారణ్యభూమి.

(ప్రవేశము లక్ష్మణుఁడు, సీత)

సీత—లక్ష్మణా! మనకొక్క తాపసాశ్రమమైనను గానిపింపక యున్నదేమి? ఒక వేళ మనము మార్గము తప్పలేదుగదా!

లక్ష్మ—(కన్నులనీరు గార్చుచున్నాఁడు)

సీత—మఱిదీ! నీవు విచారించెద వేల? కన్నులవెంట జలమువచ్చుటకుఁ గారణమేమి? తలయెత్తి మాట్లాడవేల!

లక్ష్మ—అమ్మా! పరిచారికాజనంబును నిరంతరంబుసేవింప శుద్ధాంత సౌధంబున మెలంగుచు శ్రీరామపదదాస్యము దప్ప నన్యమెఱుంగని నిన్ను భీకర శార్దూల నివాసభూమికిఁ జేర్చితినిగదా యని చింతించుచుంటిని.

సీత—లక్ష్మణా! అట్లుబలికెద వేల?

తే. గీ. మునివరుల భార్యలంగాంచ ♦ మోదమొదవె
ననుచు వచియింప శ్రీరాముఁ ♦ డాజ్ఞనిచ్చి,
పంపె నను నిన్నుఁదోడిచ్చి ♦ భవ్యచరిత
చింతయేటికి దీనికి ♦ స్వాంతమందు?

మీయన్నగారి యాజ్ఞలేకుండ నన్నుదోడ్కొని రాలేదుగదా?

లక్ష్మ—తల్లీ! నేనంత యవివేకినా! (చింతించును.)

సీత—(అనుబంధము 7.) అట్లయిన నీ విచారమేల! నిన్నుఁజూడ నాకు గూడ దిగులు కలుగుచున్నది.

సీ. పరసౌఖ్యములరోసి ♦ చిరభక్తితో నన్ను
నడవికి నేతెంచు ♦ నవ్వాడైన
అగ్రజు వెదుకంగ ♦ నరుగుమా యని నిన్ను
నానాఁడు దూషించి ♦ నవ్వుడైన

మిగుల ధైర్యము దెచ్చి ♦ మునినాథుమునిమ్ము
 సాహసంబున దాకి ♦ సప్పుడైన
దర్పించి నీపైన ♦ దానవేంద్రుఁడు శక్తి
 నతితీవ్రముగ వేసి ♦ నప్పుడైన

తే. గీ. ఇంచుకేనియు జింతించి ♦ యెఱుఁగనట్టి
 వాఁడవక్కటా నే ♦ డిట్లు వగవనేల
 చెప్పుమా కారణంబును ♦ జిత్తమందు
 జేయిపెట్టి కలచినట్లు ♦ లాయె మఱఁది !

లక్ష్మణా ! ఎంతటిదీనదశవచ్చినను ధైర్యమును గోలుపోవువాఁడవుగావు సర్వజనములును నిన్ను సుగుణాకరుండని వినుతింపుచుందురు. అట్టియెడ నీ వెవ్వరి కెగ్గుసేయ నూహించితివి? సౌమిత్రీ ! పరభామలన్న మాతృభావంబునను, పరధనమన్న గరళము తెఱంగునను,జూచుచుందువు. ఎవ్వరిని బరుషవాక్యములాడవు. అసత్యములు బలుకవు. శ్రీరామసేవ దప్ప నన్యమెఱుంగవు. నీకీ విచారమేల !

లక్ష్మ——(కన్నీరు గార్చుచు) తల్లీ ! నే నొక జననిందిత కృత్యమును జేసితిని అందులకై వగచుచుంటిని.

సీత——నీవుచేసిన జననిందిత కృత్యమేమి ? భూ యగ్రజుఁడు నిన్ను మన్నింపక నిరాకరణ జేసెనా ? లేక నీ కేయన్నపై భ్రాతృలోల గెనా? తల్లియైన సుమిత్రాదేవి నేమైన గావించితివా ? గురుజనుల నేమైన దూషించితివా ? శరణుబొందినవారిని జేపట్ట నిరాకరించితివా ! శత్రువులకు వెన్నిచ్చితివా ?

లక్ష్మ——(విచారముతో) తల్లీ ! అయోనిజవై, జనకబ్రహ్మర్షికుని గారాబుపుత్రివై ; యిక్ష్వాకువంశ పావనుండును, నిఖిలదానవగజకంఠీరవుండును నగు శ్రీరామభూపాల చూడామణికి భార్యవై యొప్పిన నీకు ఘోరారణ్యావాసము తప్పినది కాదుకదా !

తే. గీ. పాషాణ కఠిన చిత్తుండ ♦ భాస్కరకుల
మంతయును బాల్ప జన్మంబు ♦ నందినాడ
నిన్ను నే డిట్లు వనులకుఁ ♦ జేర్చినాడ
శాపమిచ్చియు నైన నన్ ♦ జంపుమమ్మ.

[అనుబంధము 8) (సీత పాదములపైఁ బడుచున్నాఁడు)

సీత—లక్ష్మణా! ఇంత వెఱ్ఱివాడ వేమి! కారణము జెప్పక చింతి చెడవు.

లక్ష్మ—సాధ్వీమణీ! ఇంతకుమున్నే పదునాల్గువత్సరము లరణ్యమున జరించి బడరాని యిడుముల నెన్నియో పడితివి. మరల నేఁటికి నీ కట్టి దుస్థితి సంభవించినది. ఎంతవాని గర్భమునఁ బుట్టిన నేమి ఎంతవానిం జెట్టఁబట్టిన నేమి? విధివ్రాత దాటుట కెవ్వరు శక్తులగుదురు? అమ్మా! నాఁడింద్రజిత్తునితోఁ బోరి చావక నేఁడు నిన్నరణ్యంబుల విడచిపోవుటకే కాఁబోలు బ్రతికియుంటిని. (ఏడ్చుచున్నాఁడు.)

సీత—అయ్యో! మఱది! ఏమిది! నీదుఃఖమంతకంత కధికమగుచున్నది.

ఉ. కన్నులనీరు నేనెపుడు ♦ గానఁగ లేదు మొగంబునందు, నీ
కన్నుల వెంటనీరు నది ♦ గాఁ బ్రవహించుచునుండె నేఁడు; నీ
వున్నది యున్నయట్టిఁ కను ♦ నొప్పుగ జెప్పుము ధైర్యమూని నా
యన్న: విచారముఁ గలగె ♦ నాత్మకు నాకును నిన్నుఁ జూచినన్

లక్ష్మ—(తనలో) అక్కటా! ఈమెకు రామాజ్ఞ జెప్పక తప్పదు చెప్పుటకు నాకు నోరాడకున్నది చెప్పినయంతనే యీమె యెట్టిసాహస కార్యమును సేయునో కదా! (ప్రకాశముగా)

ఉ. కానలలోన నిన్విడచి ♦ గ్రక్కున రమ్మని నాకు రామభూ
జాని వచించె నందులకె ♦ స్వాంతమునందునఁ గుందుచుంటినో

మానిని ! సాధుశీలవును ♦ మాన్య చరిత్రవునైన నిన్ను నీ
కానలవీడి యెట్టులరు ♦ గంగలవాడనౌ తోచదక్కటా!

సీత—లక్ష్మణా ! నీ వాక్యము నాకు మిగుల నద్భుతమును గలుగఁజే యుచున్నది. నా ప్రాణేశ్వరుఁడు నన్నీ యరణ్యములయందు విడిచిరమ్మనెనా? మరల పురంబునకుఁ దోడ్కొనిరమ్మని చెప్ప లేదా?

లక్ష్మ—తల్లీ ? ఈ కఠినాత్ముఁడు నిన్ను మరలఁ దోడ్కొనిపోవు భాగ మును నోచుకొనలేదు.

శీత—హా! ఎంతపాపాత్మురాలనైతిని! (మూర్ఛిల్లును)

లక్ష్మ—ఎంతకష్ట మెంతకష్టము!

శీత—(మూర్ఛనుండి లేచి)

తే. గీ. అన్నవచియించినట్టి ♦ వాక్యంబునీవు
నరిగ వింటివో లేదో నే ♦ నరయఁజాల
మఱచి యీరీతిజెప్పి తో ♦ మఱది ! కాక
యున్న రాముడిట్లు వచించి ♦ యున్నవాఁడె?

లక్ష్మ—అమ్మా! చెప్పుటకు నోరాడకున్నది. కాని యిట్టిదారుణకార్య మాచరించిన నేనుచెప్పుటకు మాత్రమే లవెనుదీయుదును! నిన్ను విపినంబులయందు విడిచిరమ్మనియే శ్రీరామునియాజ్ఞ.

సీత—(కన్నీరుగార్చుచు) హా ! మఱది ! ఇట్టి శిక్ష బొందుటకు నే నొ నర్చిన మహాపాపమేమియున్నది!

లక్ష్మ—సాధ్వీమణీ! ఏమిచెప్పుదును ? లోకకంటకుఁడైన రావణునిచే గొనిపోఁబడి యొకవత్సరము లంకయందుంచబడిన, సీతను మరలఁ దెచ్చుకొని శ్రీరాముఁడేలుచున్నాఁడని జనులు చెప్పు కొనుమాటల నాలించి, లోకాపవాదకు భీతిల్లి యిట్లు చేసినాఁడు.

సీత—హా రామా! రామా! (మూర్ఛిల్లును.)

లక్ష్మ—అక్కటా! ఈమెకింక దిక్కెవ్వరోకదా!

సీత— (మూర్ఛనుండిలేచి) హా! లక్ష్మణా! నాకు ప్రాప్తించిన యీ దుర్గతికి నేనేమనివగతును? అయ్యో! ప్రాణేశ్వరుఁడు నాయెడల నెంతనిర్దయ వహించినాఁడు! (శ్రీరాము నుద్దేశించి లక్ష్మణునితో)

సీ. పార్వతీవల్లభు ♦ చాపంబుఖండించె
దర్పించి నానిమి ♦ త్తంబుగాదె
మాయామృగంబైన ♦ మారీచు వెన్నంటి
ధరఁగూల్చె నానిమి ♦ త్తంబుగాదె
బలశాలియా వాలి ♦ భజించి చేపట్టె
తరణిజు నానిమి ♦ త్తంబుగాదె
అతిభయంకర యుద్ధ ♦ మందున వధియించె
దశకంఠు నానిమి ♦ త్తంబుగాదె

తే. గీ. యిట్టివన్నియు గావించి ♦ తుట్టతుదకు
జనములాడు వాక్యములకు ♦ స్వాంతమందు
భీతిఁగని కృపవీడి యీ ♦ రీతినన్ను
బాయుటిది యేటిధర్మంబు ♦ భవ్యచరిత!

(శ్రీరామునిఁదలంచి)

సీ. నినుబాయఁగాలేక ♦ నీవెంటనడవికి
వదలివచ్చుటయైనఁ ♦ దలఁపవలదె
ననుఁజూడ లంకకు ♦ జనుదెంచిన సమీర
తనయునిమాటలఁ ♦ దలఁపవలదె
నీమీద, ప్రాణముల్ ♦ నిలిపి లంకాపురిఁ
బలుబాములందుట ♦ తలఁపఁవలదె

నను నగ్నిలోఁబడు ♦ మని చెప్ప వేడ్కచె
　　　　పట్టుల నేయుమైనను ♦ దలఁపవలదె

తే. గీ. చేయునేటికి ననలుండు ♦ వేగవచ్చి
　　సీత సాధ్వియటంచును ♦ జెప్పినట్టి
　　పలుకునైనను నొక్కింత ♦ తలఁపవలదె
　　రమ్యగుణసాంద్ర ! రఘుకుల ♦ రామచంద్ర !

హా ! రామచంద్రా ! నాగుణం బెఱింగియుండియు నన్నీరీతి విడనాడితివా ! (ఇంచుకయూరకుండి) లక్ష్మణా! ప్రాణేశ్వరునిపదసేవ విడువలేక యరణ్యంబుల కరుదెంచిన నాగుణములు నీ వెఱుంగవా ? ప్రాణేశ్వరుండెఱుంగడా ? సమస్త దేవతలు చూచుచుండ నగ్నిహోత్రుఁడు సాక్షాత్కరించి సీత పరమపావన చరిత్రయని చెప్పినపలుకు లాతఁడు మరచియుండెనా ? సంపూర్ణ గర్భవతినగు నన్నుఁ బరిత్యజించుట మీయన్నకు ధర్మమా ! ఇదియేనా రాజధర్మము ? లక్ష్మణా ! ఇంక నాకీ బ్రతుకేల ?

ఉ. ధర్మముదప్పి యీ ప్రజ వృ ♦ థాయపవాదను బల్కుచుంట నా
　　కర్మము, దాని సత్యమని ♦ కాననభూమికి నన్ను బంపె నా
　　మర్మమెఱింగియున్ విభుడు ♦ మానవనాథుఁ డికేమి సేతు ; నీ
　　నిర్మల గంగలోనఁబడి ♦ నిక్కముగాఁదనువున్ ద్యజించెదన్.

లక్ష్మ—తల్లీ ! అట్టి సాహసకృత్యము వలదు. నీ వెఱుఁగని ధర్మమున్నదా ?

సీత—ఎంతనిర్దయ !

చ. ననుఁ గలనైన రామజన ♦ నాథుఁడు బాయఁడటంచు నెంచ ; నా
　　వనజభవుండు నానుదుట ♦ వ్రాసినవ్రాతకు నేమనందు, దు
　　ర్దినములు వచ్చె నింకెటులు ♦ దీరనిదుఃఖము బొంది ఘోరమా
　　వనముల సంచరింపగల ♦ ప్రాణములన్ దరియించి లక్ష్మణా.

వాటదీ ! శ్రీరామచంద్రుఁడు నాకెట్టి దుఃఖమును దెచ్చిపెట్టెను ?

సీ. అనుకూల దాంపత్య ♦ మని మోదమందితి
గాని యిట్టులగుట ♦ గానవైతి
శ్రీరాముదేవినై ♦ చెలువొందితని యెంచి
తినిగాని యీరీతిఁ ♦ దెలియనైతి
పట్టంపురాణినై ♦ వాసికెక్కితినంచు
దలచితి, నీభంగిఁ ♦ దలపనైతి
పరిచారికల్ గొల్వ ♦ వంగ నుందునటంచు
నెంచితి నీ విధం ♦ బెఱుగనైతి

తే. గీ. అకట ! యేమని దుఃఖింతు ♦ నాత్మలోన
మత్పురాకృతపాప మీ ♦ మాడ్కి నన్ను
గట్టి కుడుపుచునున్నది ♦ కాకయున్న
కరుణవీడునె నాపైన ♦ మాధవుండు.

అక్కటా ! న్యాయాన్యాయ విచారణపటిష్ఠుడగు రాముడు ముందు వెనుక లరయకుండ నిట్టికార్యము జేసెనుగదా! పోనిమ్ము. లక్ష్మణా! లోకాపవాదకు భీతిల్లి నన్ను బరిత్యజించువాఁడు నాతోడనే యేల చెప్పరాదు? నే నా మహానుభావుని యాజ్ఞ కన్యథా వర్తింతునా ? ఇంతకు నా వ్రాతఫలమిట్లున్నది.

తే. గీ. కరుణ విడనాడి నన్నునుఁ ♦ గాననాళి |
డించి రమ్మని నన్నుఁ బం ♦ పించెఁగాన
దీర్చితివి యన్నకోరిక ♦ ధీరచరిత !
పొమ్ము పురము జేరంగ వే ♦ గమ్ము నీవు.

ప్రాణేశ్వరుండిట్లు జేయుచున్నాడని నాతోఁ జెప్పియున్నచో నే నెంతయు ముదంబంది యుందునుగదా !

లక్ష్మ—అమ్మా! నిన్నుఁ జూచిన నాకు దుఃఖమాగకయున్నది. నం పూర్ణగర్భిణివగు నీ వీ యరణ్యంబున నెట్లిడుమలబడఁగలవు? భవదీయ మానసము శ్రీరాముఁడెఱింగియుండియు, లోకాపవాదకు భయంబంది, మునికన్యలను నీవు దర్శించి వచ్చుటకుఁ గోర, యానెపంబున నిన్ను వనంబులందు విడిచి రమ్మని నా కాజ్ఞాపించినాఁడు. అక్కటా! రామచంద్రుడు నాచే నెట్టి బెట్టిదమైన కార్యము చేయించెను!

సీ. కంటకావృతమైన ♦ కాననంబులె నీకు
మణిసౌధరాజియా ♦ మగువమిన్న!
కడుభీతిఁ గలిగించు ♦ కాననమృగములే
నీ చెలికత్తెలా ♦ నీరజాక్షి!
యల కీరపికనిక ♦ రారావములె నీకు
మంగళవాద్యమా ♦ మాన్యచరిత!
కందమూలములె నీకు ♦ గడుపార భక్షించు
నిష్ట మృష్టాన్నమా ♦ యిగురుఁబోఁడి!

తే. గీ. కఠిన పాషాణముల్ చంద్ర ♦ కాంతశిలల
తగిన పాదరింద్లు నీకు ను ♦ ద్యానవనులు
కటకటా నీకు నెట్టి దు ♦ ర్గతులు కలిగె
భవ్య గుణగాత్రి జనక భూ ♦ పాలపుత్రి

సీత—లక్ష్మణా! నీవు నన్నుఁగూర్చియేల చింతించెదవు! పూర్వ జన్మంబున నెట్టిదంపతుల నెడబాపితినో యా పాపమిప్పుడను భవింపవలసివచ్చినది. (ఇంచుక యూరకుండి) మఱదీ: నిన్ను బరిత్యజించుచుంటినని శ్రీరాముఁడుఁ నాతోఁజెప్పక పోయెను, నీవైన నేలఁ పురంబున జెప్పకపోయితివి! (రాముని నుద్దేశించి) హా! రామచంద్రా! నాకీసంగతి చెప్పియుంటివేని

సీ. కడసారి చూపంచుఁ ♦ గనులార నిను నేను
　　వీక్షింపకుందునే ♦ విమలచరిత !
కడసారి మ్రొక్కటం ♦ చదనెంచి నీ పదం
　　బుల మ్రొక్కకుందునే ♦ లలిత తేజ !
చివరగాగిలియని ♦ చేరి కఱవుదీరఁ
　　గౌగలింపనె నిన్ను ♦ శ్రీగుణాఢ్య !
లలితభాషణకిదే ♦ పొలితుదయని మన
　　సార భాషింపనే ♦ సాధుమూర్తి !

తే. గీ. మరల నినుఁజూచు భాగ్యంబు ♦ మహితలమున
　　గలుగునో గల్గదో నాకు ♦ దెలియరాదు
　　మోసపోతిని మఱియింత ♦ మోసపోతి
　　రక్ష్య కరుణా స్వభావ ! శ్రీ ♦ రామ దేవ !

(లక్ష్మణునిఁజూచి) సుమిత్రాత్రనూభవా ! ఇంక నేను విచారింపనేల? నాకర్మ మీరీతిగ నున్నది. ఇందు నా ప్రాణేశ్వరునిఁగాని నిన్నుగాని నిందింపవలసిన యవసర మేమియును లేదు. సత్కులీను లెవ్వరును దుర్య శము భరించుటకు సమ్మతియరు, తనకువచ్చిన నిందకు కారణురాల నైన నన్నుఁ బరిత్యజించి శ్రీరామచంద్రుఁడు తన యశశ్చంద్రికలఁ గాపాడుకొనవలసినదే. నా కీకష్టము గలిగినందులకు విచారింపనుగాని భగవత్స్వరూపుఁడగు శ్రీరామచంద్రుని పాదపద్మసేవను విడువవలసి వచ్చెనుగదా యని చింతించుచుంటిని. లక్ష్మణా! సమస్తాభీష్టప్రదం బగు, పాపవిమోచనకరంబును, నగు శ్రీరాముని దివ్యమంగళరూపం బను నీ జన్మంబున మరల జూచుభాగ్యమిక నాకున్నదో లేదో!

లక్ష్మ—(విచారములో)

శా. మాణిక్యోజ్జ్వల రత్నసంకలిత హ ♦ ర్మ్యంబందు దా సీజనుల్
　　పాణిద్వంద్వముబట్టుచుఁ మిగుల ♦ సేవల్ చేయగానొప్పు చుఁ

ప్రాణేశాంఘ్రిసరోజచింతయనుసత్ ♦ భాగ్యంబునంబొల్చునో
యేణీలోచన ! నిన్నుఁజేర్చితిగదా ♦ యీ ఘోరకాంతారముఁ
మాతా! ఇట్టి దారుణకార్య మాచరించిన నాకేమిదుర్గతి కలుగునో
గదా! నిండు చూలాలవైన నిన్ని యరణ్యంబున విడిచి నే నెట్లుపోవఁ
గలను?

సీత—లక్ష్మణా ! నీవు విచారింపకుము. శ్రీరామచంద్రుని యాజ్ఞ
యనుల్లంఘనీయము. ఇంక నీ వరుగుము. నాగతి యెట్లుగా
నున్నదో యట్లగును.

లక్ష్మ—(విచారించును)

మ. ధరణీనాథుఁడు రామమూర్తి వినుఁ గాం ♦ తారంబునన్ డించి స
త్వరగా రమ్మని చెప్పె; నిన్విడిచి పో ♦ వంజాలకున్నాఁడ నీ
తరుణిన్ జూచి, సహించి యెట్లరుగుదున్ ♦ గట్టా! యికేమందు,నే
తెరు వూహింతువొ తెల్పుమీకృపను సా ♦ ధ్వీరత్నమా! జానకీ!

(సీతపాదములపైఁబడి) జననీ ! నాఁడు దండకారణ్యమున మాయామృ
గంబునుబట్టి తెచ్చుట కరుగ మారీచుండు మసలవంచింప హా లక్ష్మ
ణా! సీతా! యని యరవ నీవు భీతినంది రాముని వార్త నారసిరమ్మని,
నాకుఁ దెలుప,నేనునిరాకరించి, నీవెన్నియో కఠినభాషణంబుల నాడిన
గాని కదలని నేను నేఁడు ఘోరారణ్యమునకు విడిచి పోవలసి వచ్చి
నది. హా!సీతా! లోకమాతా! నీకింకెవ్వరుదిక్కు ?

సీత—సౌమిత్రీ !నీవు వగవవలదు, నీయగ్రజుని యాజ్ఞాప్రకారమాచ
రించితివి. ఇంక నీవు పురంబునకు మరలుము. శ్రీరామచరణ
సాన్నిధ్యమును విడిచిన నేను జీవింతునని తలంచితివా!అదిగో!
ఎదుట గంగయున్నదికదా!

లక్ష్మ—జననీ!నీ వాక్యములు చూడ నాకు దుఃఖము పొంగి పొరలు
చున్నది.

తే. గీ. ప్రాణనాథుఁ డీరీతి నిన్ ♦ బాసె ననుచు
దలఁచి దుఃఖంబు నందుచు ♦ దనువు గంగ
కర్పణము సేయవలదు మా ♦ యమ్మ! నీవు
భ్రూణహత్యాదోషంబునుఁ ♦ బొందఁగలవు॥

సీత—లక్ష్మణా! నన్నుఁ జావకుండ గూడఁ జేసితివే! కానిమ్ము నీవింక నరుగుము. అత్త గారిన పరాయణులందును, దివ్యమంగళ విగ్రహులందును, నగు నాప్రాణేశ్వరుని పాదపద్మములకు భక్తి పూర్వకముగఁ బ్రణమిల్లితి ననుము. ఎప్పుడునుదననామ స్మరణము విడువనని చెప్పితినని చెప్పుము. అత్తలకు నమస్కారములనుము. భరతశత్రుఘ్నులను, మఱదండ్రను దీవించితినని తెలుపుము.

తే. గీ. ఉర్విపై నేను జీవించి ♦ యున్న నిన్న
గాంచు భాగ్యంబు నాకును ♦ గలుగునయ్య
కానిచోనిది తుదిచూపు ♦ గాఁ దలంచి
పోయి రమ్మిక లక్ష్మణా! ♦ పురమునకును.

లక్ష్మ—(ఏడ్చుచు) తల్లీ! నిన్న విడనాడక తప్పదయ్యె. ఇంక నాకనుజ్ఞ నిమ్ము.

మ. జననీ! రామపదారవిందముల న ♦ శ్రాంతంబు సేవించు, నిర్
వనిలో వీడుచుఁ బోవుచుంటి నిక నిర్ ♦ దాక్షిణ్య మేపారఁగా
గని,యెల్లప్పుడుగాచుచుండెదరుగా♦కన్ సూర్యుఁడుర్ జందుడుఁ
వనజాతోద్భవశంకర ప్రముఖ దే ♦ వశ్రేణియున్ మానులుర్-

(ఇవతలకు వచ్చి)

చ. జనకనృపాలమౌళిసుత, ♦ సద్గుణపేటి, సుశీల, సాధ్వి, రా
మునిసతి, యట్టి సీత నిటు ♦ భూరివనంబుల యందు డించి యా
జనపతి యాజ్ఞపైన; గడు ♦ సాహసలీలను బోవుచుంటి నో

యనిమిషులారా ! యీ మౌనికి నరచితసత్కృపమీరు జూపరే.
(అనుబంధము 8) (నిష్క్రమించును.)

సీత—(తనలో) సౌమిత్రి యరిగినాఁడు. ఈ ఘోరారణ్యమున నాకెవ్వరు దిక్కు ? నేనిప్పుడెచ్చటికిఁబోవుదు ? (ఆలోచించి) పుట్టింటికరుగుదునా ! భర్తచే విడువఁబడి యచ్చటికేరీతి బోవుదును? ఓ వనమృగంబులారా ! నన్నుఁజంపి తినరాదు ! ఓ దివిజస్రవంతీ ! నన్ను నీలో జేర్చుకొనుము. (రాముని దలంచి) హా! రామచంద్రా ! సుగుణసాంద్రా ! నీ చరణదాస్యము విడిచి నే నెట్టుఁ బ్రదుకంగ జీవింపఁజాల. ఈ గంగలోఁబడి ప్రాణంబుల విడిచెద. ఇన్ని జన్మములెత్తినను నీవే నాకు నాథుఁడవగుదువు గాక. (గంగను సమీపించి తల్లీ ! భాగీరథీ ! నాకు ముక్తి దయచేయుము, (ఇంచుక యూరకుండి) అక్కటా ! లక్ష్మణుండు నన్నుఁ జావవలదనియు, నట్లు చేసితివేని భ్రూణహత్యాదోషమునకు పాల్పడుదువనియుఁ జెప్పినాఁడు లక్ష్మణా ! నన్ను మరణమందకుండఁ గూడ, జేసితివే ?

(వాల్మీకి—ప్రవేశము.)

వాల్మీ—(ప్రవేశించి-సీతనుజూచి-తనలో) ఎవ్వరీకాంత ! నట్టడవియందొంటిగ నుండి విలపించుచున్నది. (ఆలోచించి) సరే ! తెలిసినది ఈమెను సమీపించి సంతాపము బోఁగొట్టెదగాక (సమీపించును.)

సీత—(వాల్మీకినిఁజూచి) మహాత్మా ! నా వందనము లందుకొనుము నీ వెవ్వరవో నాకు దెలియదు. దిక్కుండియు దిక్కులేనిదాననై యీ ఘోరారణ్యమునఁ జిక్కిన నన్ను రక్షింపుము.

వాల్మీ—సాధ్వీమణీ ! నేను వాల్మీకిని. నీయుదంతం బంతయు నేను దివ్యదృష్టిచేఁ గనుగొంటిని. నీవు జనకపుత్రివి. శ్రీరామభార్య

వు. జనాపవాదభీతిల్లి రాముండు నిన్నిట్లు చేసినాఁడు. నీవు చింతింపవలదు. నీకిరువురు తనయులుద్భవ మందుదురు. నీవు నా యాశ్రమమునకురమ్ము. మునికన్యలు నీకు వలసిన పరిచర్యలఁ జేయుదురు. శ్రీరామునకు నీయందు దయవచ్చువరకును నా యాశ్రమంబున నుండుము. నీకు జనకుఁడెట్టివాఁడో యట్టి వానిఁగ నన్ను భావింపుము. రమ్ము.

సీత—మునీంద్రోత్తమా! నీ యపారప్రేమకు సంతసించితిని. ఇఁక నాకు దిక్కు నీవే?

వాల్మీ—అమ్మా! రమ్ము. (నిష్క్రమింతురు)

---

## రంగము.

(వృక్షముక్రింద రథసమేతుఁడై సుమంత్రుఁడు ప్రవేశము.)

సుమం—(తనలో) లక్ష్మణుండింకను రాకయున్నవాఁడేమి? ఆ గర్భ శ్రీమంతురాలగు జనకపుత్రికెట్టి యిడుములు సంప్రాప్తించినవి! ఆ సాధ్వీమణి గుణంబు లెఱింగియుండియు జనాపవాదకు భయంబంది యామెను విడిచిన శ్రీరాముఁడింకెట్లుండునో కదా! (ఎదుటఁజూచి) అదిగో! లక్ష్మణుఁడు సీతను విడిచి వచ్చుచున్నచున్నాఁడు.

[లక్ష్మణుఁడు—ప్రవేశము]

[అనుబంధము 10]

లక్ష్మణుఁడు—(విచారముతో)

ఉ. ఎంతటి పాపకర్ముఁడనొ • యెంతటి క్రూరుఁడనో విదేహభూ
కాంతతనూజ? సీత, ద్విజ • కన్నుత సద్గుణశీల నట్లుదు
ర్దాంతవనాళి విడిచితి • రాముని యాజ్ఞను బూని యింక నా
కాంత దురంత చింతఁబడి • కాయము బాయునొ యేమి సేయునో

అక్కటా! ఇంక నా జగన్మాతయగు సీతకు దిక్కెవ్వరు !

సుమంత—(లక్ష్మణుఁజూచి) లక్ష్మణా ! పూతచరిత్రయగుసీతను నర ణ్యంబున విడచి వచ్చితివా?

లక్ష్మ—సుమంత్రా ! యీ కఠినాత్ముఁడా కార్యమును జేసియే వచ్చి నాడు.

సీ. కడుభక్తిఁబరిచారి ♦ కల్గొల్వఁగాఁబాసి
యీవిదవనాళి నె ♦ ట్లుండఁగలదొ
మందిరారామసీ ♦ మలఁ జరింపవెఱచు,
యింతి కొండలనెట్లు ♦ లెక్కఁగలదొ
నవరసాన్నంబున ♦ దవిలియుండిన లేమ,
వనఫలంబుల నెట్లు ♦ దినఁగఁగలదొ
నిరతంబు పతిసేవ నెగడుచుండెడిసాధ్వి
యొంటిగా నడవి నె ♦ ట్లుండగలదొ

తే.గీ. ఎండవానలనేమియో ♦ యెరుఁగనట్టి
యమిత సుకుమారి యెట్లు వ ♦ ర్షాతపముల
నోర్వఁగలదొ ; యక్కటకటా ! ♦ యూర్వీపుత్రి
కెట్టి యిక్కట్లు ప్రాప్తించె ♦ నేమిసేతు.

సుమం— సౌమిత్రీ ! వలచింతించెదవు ? దీనివలనఁ బ్రయోజనమేమి యున్నది ! రామాజ్ఞ నెఱవేర్చితివి. శ్రీరాముఁడు నీ రాకకై వేచియుండును, రథంబెక్కుము. పోవుదము

లక్ష్మ—సుమంత్రా !

తే. గీ. వచ్చునప్పుడు సీతతో ♦ వచ్చియుంటి
శూన్యరథముతోఁ బురమెట్లు ♦ చొచ్చువాఁడ
నచటి వారెల్ల సీత యే ♦ దంచు నడుగ
జెప్ప నోరాడునే ! యిట్లు ♦ చేసితనుచు.

(ఇంచుకయూరకుండి) ఏమీ! సీత నట్లరణ్యంబులవిడిచి నేను పురంబునకు రావలయునా? (కోపము దెచ్చుకొని యస్త్రము సంధించి)

మ. అలుకన్ మత్కరమండితాతతధను ♦ ర్జ్యాముక్తనారాచవం
క్తుల నందంబుఁ జరింపజేసి త్రిజగ ♦ క్షోభంబు గావింతు, భూ
తలపుత్రిం గొనివచ్చి రాముఁ గని, కాం ♦ తారత్నముం గొమ్మని
స్తులచారిత్రియటంచు దెల్పఁగను దో ♦ ర్దృప్త సర్వలోకేశులున్.

నే నట్లొనర్చితినేని లోకపాలకులు భయంబంది సీతను దోడ్కొని వచ్చి శ్రీరాముని సన్నిధింబెట్టి యామె సాధ్వియని తెలిసి యాతడామెననుగ్రహించునట్లు చేయుదురు.

సుమం—(లక్ష్మణునిబట్టుకొని) లక్ష్మణా! శాంతింపుము. ఇట్లొనర్చితివేని సకలలోకములును నాకులపాటొందును. ఇదియుంగాక యొక పరమరహస్యమున్నది. మున్ను దేవదానవయుద్ధమున దానవులు శ్రీహరికి భయమంది భృగుముని భార్య శరణుఁ బొందిరి. అప్పుడు శ్రీహరి యమరులను రక్షించుటకుఁ దన చక్రముచే భృగుపత్నిం దునిమెను. అందులకు భృగుమునీంద్రుఁడలిగి భూమిపై మానవజన్మమెత్తి యాత్మపత్నీవిరహార్తి నందుదువుగాక యని హరికి శాపమిచ్చెను. రాముఁడే శ్రీహరి. సీతయే లక్ష్మి. ఇయ్యది నీవు గుప్తముగా నుంచుము. రమ్ము. రథంబెక్కుము. పురమునకుబోవుదము.

లక్ష్మ—(రథమెక్కుచు ఇరువురును నిష్క్రమింతురు.)

ఇది ద్వితీయాంకము.





శ్రీ

# సంపూర్ణోత్తర రామాయణము.

## ద్వితీయాంకము.

రంగము:—అయోధ్యయందలి సౌధము.

[ప్రవేశము—విచారముతో శ్రీరాముడు]

శ్రీరా—(తనలో) ఆహా! నాహృదయమును వనజభవుఁడు కఠిన శిలతో నిర్మించెనుకాబోలు! కాకున్నచో నెవఁడో పామరుఁ డాడిన పలుకులువిని పూతచరిత్రయగు జానకిని నరణ్యము లకుఁ బంపుదునా? ఇట్టిది జనకుఁడెఱిఁగి యెంతచింతించునో కదా! అక్కటా! నిరంతరమును నాసేవదప్ప నన్యమెఱుంగని సాధ్వి సర్వసంపదలను, భోగంబులను విడనాడి పితృవాక్యపరి పాలనార్థమై నేనరణ్యములకరుగుచున్నపుడు నావియోగంబును సహింపజాలక నావెంట ఘోరాటవుల కరుదెంచి నాసుఖ ములు తనసుఖములుగను నాకష్టములు తన కష్టములుగను భావించి నన్ను సేవించిన సాధుచరిత్ర, దండకారణ్యంబున మాయాకురంగమైన మారీచుఁడు మమ్ముల వంచింప, "హా లక్ష్మణా! సీతా!" యని కేకవేయ, నాకేమియాపదసంభ వించినదోయని భయంబంది, పర్ణశాలయందుండ నొంటిగ

నుండవలసివచ్చునని యైనను దలంపక నన్నరయుటకు సౌమిత్రిని బంపించిన వేల. అట్టి సీతకు నే నెట్టి యిడుమలఁ గల్పించితిని ? (సీతను దేసింఛి) హా ! సీతా !

సీ. పావనచరిత్రవై ♦ భాసిల్లి తని పల్కు,
ధర నయోనిజవయి ♦ తనరినావు
ఘనరాజఋషియైన ♦ జనకభూపాలుని
ముద్దులపుత్రివై ♦ బొలిచినావు
తరణివంశమణియౌ ♦ దశరథక్షితిపాలు
పెద్దకోడలవౌచు ♦ వెలసినావు
దైత్యవంశాటవి ♦ దావానలుండన్న
యొప్పు నా భార్యవై ♦ యొప్పినావు

తే. గీ. పరమసుగుణంబులందున ♦ ధరణిపుత్రి
జెప్పిభువినిమరొక్కరి ♦ జెప్పవలయు
నంచు నగ్నిహోత్రుని మెప్పు ♦ నంది నాకు
సంతసంబును గూర్చితి ♦ కాంత ! నీవు.

హా! జనక రాజతనయా!

చ జనకుని సత్యశాసనము ♦ సమ్మతి బాలన సేయనెంచిఁ యు
వ్యసనముల వాసముఁ సలిపి ♦ వచ్చితి నింకవయిః సుఖంబులః
గనుచు జనంబు మెచ్చగను ♦ భ్రాతల మేలుచు నిన్నుఁ గూడియుం
దునని తలంపగా నకట ♦ లోకయజసంభవుఁ డిట్టువార్చెగా.

అపవు యుంబడిన కష్టంబులన్నియుఁ దీరిపోయినవనియు, నింక సుఖంబుగా నుందుననియుఁ దలంచితిని ; కాని యిట్లు లోకాపవాదము వచ్చుననియు, నేను నిన్ను బరిత్యజింతుననియు కలనైనఁ దలంపలేను. హా జానకీ ! నిరంతరమునీయ చరణధ్యానాసక్తచిత్తా

సీ. నీ నిమిత్తమె కదా ♦ నీలకంఠుని విల్లు
పృథ్వీశులీక్షింప ♦ విఱచినాఁడ
నీ కొఱకే కదా ♦ నిర్జరారాతియౌ
మారీచునుద్భటిని, దు ♦ న్మాడినాఁడ
నీ కోసమే కదా ♦ నిజశౌర్యమున వాలి
గూలవేసి యినజు ♦ నేలినాఁడ
నీ కతంబునకదా ! ♦ లోకకంటకుఁడైన
దశకంధరునిఁ గూల్చి ♦ తనరినాఁడ
తే. గీ. ఇట్టి కార్యంబులను జేసి ♦ చిట్టచివర
నకటకట ! లోకనిందకు ♦ నాత్మయందు
భీతినొందుచు నిర్ఘోర ♦ విపినములను
విడిచి రాఁ జెప్పితిని గదా ♦ విమలగాత్రి !

సంపూర్ణగర్భవతివగు నిన్నరణ్యమునకుఁ బాలుచేసితిని గదా ! గర్భవతి వైతివనియు, సుతోదయభాగ్యము నాకుఁ గలుగుననియు సంతసించితిని కోరికలు గొంతెమ్మకోరికలయ్యెను గదా హా ! తరుణీ !

చ. వనములలోన నిన్విడిచి ♦ వచ్చెడివేళ సుమిత్రపట్టి భో
జనములు పల్కుమాటలకు ♦ స్వాంతమునందుఁ గలంగి యిట్టులన్
నినువిడనాడె రాముఁడని ♦ నీకును దెల్పిన యంతనే మనం
బున నను గూర్చి యేకరణిఁ ♦ బొందితివో కద! యాగ్రహంబునన్

నా ప్రాణేశ్వరుండింతటి కష్టచిత్తుఁడాయని యెట్లు తలంచితివో కదా ! ప్రాణేశ్వరీ ! నీగుణంబులు నాకు దెలిసియుండియు నిన్ను విడిచితిని, నావంటి నిర్భాగ్యునకు. భార్యవై యుండుటచేతనే నీకిట్టి కష్టములు సంప్రాప్తించినవి. నీజనకుని యింట నేమిసుఖంబులఁ బొందియుంటి వో కాని, నన్ను వివాహమాడినదిమొదలు నీకు గష్టములే ఘటిల్లినవి

హా:! విదేహరాజతనయా? నీకు సంప్రాప్తింపజేసిన యీదుర్గతికి నేనేమనివగతును ?

చ. మనుకులపావనుండు, గడు ♦ మాన్యచరిత్రుఁడు రాఘవేశ్వరుం
డని ముదమందినన్ బరిణ ♦ యంబును జేసినుగాని యిట్టు లీ
వనములయందు సంతతము ♦ వాసము సల్పఁగ జేయుమంచు నీ
కకటఁడెయుండ వెయ్యగద ♦ సారసపత్రి విశాలలోచనా !

హా! రమణీశిరోమణి! నిన్ను వనంబులపాలుజేసి యిప్పుడు చింత నందుచుంటి. నిన్ను నేనుమరల గాంచగల్గుదునా ? అట్టి భాగ్యము నాకబ్బునా? (ఇంచుక యూరకుండి) అక్కటా! కాంతామణి యరణ్యములయందు దిట్టుంచునో కదా!

చ. అనఘుఁడు లక్ష్మణుండు జన ♦ కాధిపపుత్రిని వీడినంత. నే
మనుచుఁదపించునో మున ♦ యాశ్రమభూమినుండఁబోయెనో
కనులను నశ్రుబిందువులు ♦ గార్చుచు, నాధుడెయిట్లుచేసెగా
యని మదిఁగుంది దేహమున ♦ నాసనువీడుచునీల్గెనో కదా!

హా !సీతా!నీవులేని యీ మందిరము కళావిహీనమైయున్నది.

[లక్ష్మణుఁడు — ప్రవేశము.]

లక్ష్మ —(తనలో విచారముతో) సుమంత్రుని గృహమునకుఁ బంపి నేనిట్లు వచ్చితిని. అక్కటా! నేంత పాపకర్ముడను!

సీ. వనజాక్షి విడనాడి ♦ వచ్చినావాయని
యడుగు మాయన్న కే ♦ మనెదువాడ
ధన్యచారిత్రి సీ ♦ తమ్మ యేమయ్యెరా
యనెడి కౌసల్య కే ♦ మనెదువాఁడ
మాదేవి జానకి ♦ మనవదేదను సీత
చెలికత్తెలకు నెల్లు ♦ చెప్పువాడ

అక్కయ్య యేదంచు ♦ నడిగెడి యూర్మిళా
దిసతుల కేమంచు ♦ దెలుపువాఁడ

గీ. మహిత సాకేతనగర సా ♦ మ్రాజ్యలక్ష్మి
సీత నెచ్చోటడించి వ ♦ చ్చితి నటంచు
నడుగు పౌరుల కేమని ♦ నుడువుఁవాఁడ
నక్కటా ! తోఁచదయ్యెను ♦ నాత్మలోన

(శ్రీరాముని జూచి) ఇదుగో రామచంద్రుఁ డొంటిగ నిచ్చట సీతంగూర్చి కాలోలు విచారించుచూ నున్నవాఁడు సీతను నరణ్యంబులందు విడిచి వచ్చితినను మాట నిప్పుడీతనికిఁ జెప్పవలయును గదా. అక్కటా ! ఎట్లు చెప్పుదును (సమీపించి) అగ్రజా ! లక్ష్మణుండిదే నమస్కరించుచున్నాఁడు.

శ్రీరా—(లక్ష్మణునిఁజూచి) తమ్ముఁడా లక్ష్మణా నాసర్వసౌఖ్యములకు నాలవాలము. నా సంతోషమునకు మూలకారణము, నా సుఖదుఃఖములకుఁ దోడునీడ, సద్గుణములయందు నాకీలోకమునకుఁ దలకట్టు. సకలసంపదలను బరిత్యజించి నావెంట నరణ్యములఁ గరుదెంచి నన్ను సేవించిన సాధ్వీమణి, పరమపావనచరిత్రయని యగ్నిదేవునిచే మెప్పొందిన సుగుణవధూటి, అట్టి సీత నరణ్యభూములయందు విడనాడి వచ్చితివా ?

లక్ష్మ—అగ్రజా! కఠినచిత్తుఁడనై నేనట్టి కార్యమును జేసియే వచ్చినాను.

శ్రీరా—తమ్ముఁడా! అకారణనిందను గాంచి యా పరమపతివ్రతామణిని నరణ్యంబునకుఁ బంపితినిగదా ! నేనట్టి దుష్కార్యమొనరించితినని యక్కాంత నన్నెంతగా దూఱుచున్నదో ! ఎంతగా శపించుచున్నదో ! ఆ యింతిలేని నా ప్రాణములేల ! సావిత్రీ! ఈ జన్మంబున నింక నేను సీతను జూడనుగదా ! (సీతనుద్దేశించి) హా ! సీతా !

మ. కలికీ! కన్నులపండువై లలితమై • కల్యాణ సంధాయమై
లలితానంద విశేషదాయకమునై • లక్ష్మీవిలాసంబునై
బలుచందంబుల సమున్నతావహమునై • భాసిల్లు నీదివ్యసుం
గళరూపం బికఁ జూడఁగాంచుటొక భా • గ్యంబున్నదే ధారుణిన్.

లక్ష్మ — (అనుబంధము II) అగ్రజా! సీతాదేవినిగూర్చి యిట్లు చింతింపఁదగదు. నీకు దెలియని పరమధర్మము లేమి గలవు? మానవునకు సుఖదుఃఖములు సహజములు. నీవు సామాన్యమానవుండవు గావు. పరమాత్ముండవు జగమునందెల్లెడ నెఱింగియుంటివి. నీయందు నిశ్చలభక్తిఁబూని సేవించు మహాత్ములే పుత్రమిత్రకళత్రాదులపై మోహమును విడిచి విరక్తులై యుండఁగా, నీవు చింతించుట ధర్మమగునా? నీ వీ రీతి నద్దేవికై చెంగఁగొనియున్నచో, రాముఁడు భార్యను బాసి ధరాపరిపాలనము మఱచియుండెనని జనులు పలికెదరు.

[భరత శత్రుఘ్నులు—ప్రవేశము]

భర — (శత్రుఘ్నునిజూచి) తమ్ముఁడా! అరణ్యమున సీతను విడిచి లక్ష్మణుఁడు వచ్చినాడు. మనము శ్రీరాముని దర్శింతము రమ్ము.
(రాముని సమీపింతురు)

శ్రీరా — తమ్ములారా! రండు. అటఁ గూర్చుండుఁడు.

[భరత శత్రుఘ్నులాసీనులగుదురు.]

శ్రీరా — తమ్ములారా!

ఉ. పామరుఁడాడు వాక్యములఁ • బాటియొనర్చి సుశీలయైన యా
భూమిజఁ గాననంబులకుఁ • బోవఁగఁ జేసితి, నామె లేని నా
కీ మహి యేల! భోగములు • వేటికి? సంపద లేల? యింక ను
ద్ధామవనాళి కేగెదను • తాపసవృత్తిని సంచరింపఁగన్.

భర—అగ్రజా ! గణించినదానికి నీ విట్లు విచారించుట తగదు. నీచే యరణ్యములకేగినచో మేముమాత్రము నగరంబున నుందుమా ! నీవు సామాన్యమర్త్యునిలాగున సంతాపమందెద వేల?

తే. గీ. పుడమిఁ గేవలనరుఁడవే ♦ భూభరంబు
బాప నవతారమునుదాల్చి ♦ పట్టి యుంది
రాఘవుండవు నీవు శ్రీ ♦ రామచంద్ర
చింతనొందెద నేటికి ♦ స్వాంతమందు ?

సీతను విడిచితినని మేల పరితపించెదవు! సీతామెను బాయలేదు. ఆమె నిన్నుఁ బాయలేదు. నీయందామెయున్నది. ఆమెయందు నీవుంటివి.

శ్రీరా—(సీతందలచుకొని) హా ! సీతా! నిన్నెట్టికడగండ్లపాలుఁ జేసితిని. నేనట్లు కఠినచిత్తుఁడనగుదునని నీవెన్నఁడును దలంపవైతివి కదా ! అయ్యో! ఘోరారణ్యమే నీకుఁ బురమయ్యెనా? కఠిన పాషాణకంటకావృతమైన రానేలయే నీకు బూవుల పాన్పయ్యెనా ? అతిభీతిఁగొల్పు ఖడ్గ సింహవ్యాఘ్ర భల్లూకాది ఘోరమృగారావములే నీకు వీణారవమయ్యెనా ? కందమూల ఫలంబులే నీకుఁ గడుపారభక్షించు నవరసభోజ్యములయ్యెనా ?

భర—అన్నయ్యా ! వెఱ్ఱివానివలె నీవు చింతించిన, మేమేమని నుడువఁగలము ?

చ. గతజలసేతుబంధనము ♦ కైకొనక నీగతిఁ గుందకుండ, నీ
క్షితిహయమేధయాగమును ♦ జేయుము దేవతలెల్లమెచ్చ ; నీ
మతిగలతాపమంతయును ♦ మాయును; సర్వశుభంబులుం మహో
న్నతయశముం లభించు నర ♦ నాథులయందున రాఘవాగ్రణీ

శ్రీరా—తమ్ముఁడా ! అశ్వమేధయాగమను మాటఁ జక్కఁగ జ్ఞప్తికిఁదెచ్చితివి. రావణుని వధించిన బ్రహ్మహత్యాపాతక నివారణార్థమై యా యాగమును జేయవలయునను తలంపిదివఱకే యు

న్నది. (శత్రుఘ్నునిఁజూచి) తమ్ముఁడా! శత్రుఘ్నా! నీవరిగి వసిష్ఠమునీంద్రునిఁ దోడ్కొనిరమ్ము.

శత్రు—(నిష్క్రమించును.)

శ్రీరా—తమ్ములారా! అశ్వమేధయాగంబును గూర్చిన తలంపుమంచిదే కాని యయ్యది నేను చేయుట కర్తవ్యండనగుదునో కానో తెలియదయ్యె.

భర—(ఎదుటఁజూచి) అగ్రజా! మనగురువగు వసిష్ఠుఁడరుదెంచుచున్నాఁడు

(శత్రుఘ్నుఁడు వసిష్ఠుఁడు ప్రవేశము.)

శ్రీరా—(వసిష్ఠునిజూచి) గురువర్యా! ఇటుఁ గూర్చుండుము.

వసి—(ఆసీనుఁడై) రామచంద్రా! నన్ను రావించుటకు గారణం బెఱిఁగింతువే?

శ్రీ—మహాత్మా! మహాతపోధనుండగు నీవు గురుండవై యుండుటచేతనే మా యిక్ష్వాకువంశం బింత పావనత వహించినది. (ఇంచుక యూరకుండి) మునీంద్రా! రావణుని వధించినందులకు సంభవించు బ్రహ్మహత్యాపాతక నివారణార్థమై యశ్వమేధయాగము సేయఁదలంచితిని. ఇందులకు నీయభిప్రాయమేమి?

వసి—రామా! ఇక్ష్వాకవంశపావనుఁడవగు నీవా యాగమునుదప్పక చేయవలసినదే. దానిం జేయుటకు నీవెంతయు దగినవాఁడవు.

శ్రీరా—మహానుభావా! అపత్నీకుఁడు యాగమాచరించుట కర్తవ్యం దగునా?

వసి—నేనాసంగతియే చెప్పఁబోవుచున్నాను. అగ్నిహోత్రాది కార్యములకు సతులే మూలము. హేమమయంబౌ సీతాప్రతిరూపంబును గల్పించి క్రతువు జేయవచ్చును. ధర్మశాస్త్ర మిట్లు చెప్పుచున్నది. నీవావంతయును సందియంబును బొందవలదు.

శ్రీరా—అన్నిటకిని గురుండవగు నీవే యున్నావు.

(తెరలో)

హా! కుమారా! నీకింతలోనే నూరేండ్లు నిండెనా?

శ్రీరా—లక్ష్మణా! ద్వారము ముందెవ్వరో రోదనము సేయుచున్నారు, అరసిరమ్ము.

లక్ష్మ—(నిష్క్రమించి వెంటనే ప్రవేశించును.)

(వృద్ధబ్రాహ్మణుఁడొకడు మృతుఁడైన తన కుమారుని కళేబరముతో నేడ్చుచుఁ బ్రవేశించును.)

బ్రాహ్మ—(మృతశరీరమును శ్రీరామునిముందుఁ బడవైచి) కుమారా! మమ్మీరీతి విడనాడిపోవుట నీకు ధర్మమా? మా వలన నేమి దోషము కలదు. నావంటినిర్భాగ్యునకు నీవుదక్కుదువా? అనేకుల వేల్పులను గొల్చి నిన్ను గంటిని. వంశము నిల్పెనుగదాయని తలంచితిసిగాని, యకాలమృత్యువు నిన్ను మింగునని తలంపనైతినిగదా! నీమీఁదనే ప్రాణముల నిల్పుకొనియున్న మా యమ్మకేమి దిక్కుఁ జూపితివి? ఇంక మాకు దిక్కెవ్వరు?

శా. చుంచల్లాడఁగ, రావిరేకు గదలన్ ♦ జోద్యంబుగా, ఘల్లు ఘల్లంచున్ మోగ్రయఁగ గజ్జెలందియలు,నా ♦ హ్లాదంబుగల్పించుచున్
చొంచద్బాల మనోహరాకృతిని నే ♦ చందంబునన్ వీడి, జీవించన్ శక్తుఁడనౌదునయ్య తనయా ♦ వృద్ధివిన్ ననున్ బాసితే.

అక్కటా! పుత్రునకుఁ దండ్రియే దహనాది కృత్యముల సలుపవలయునె. (ఇంచుకయూరకుండి) శ్రీరామచంద్రుఁడు ధర్మసంధుఁడనియు, నాయము సముండనియు వినియుంటిని. నేఁడునీమృతివలన నయ్యది మృషయని తెలిసినది. వర్ణాశ్రమధర్మరక్షణము వేదములయందుఁ జెప్పఁబడిన రీతిని రాజేంద్రుఁడొనర్పఁడేని యాతఁడా దోషముసందును అ రాజదోషమున

భూజనులకిట్టి యకారణమృత్యువు మొదలగు బాధలు సంభవించును.

శ్రీరా—(భూసురుని వాక్యములు విని యతనిని విలోకించి) భూసురోత్తమా! ఈబాలుని మృతశరీరమును నిచ్చటకు దెచ్చివిలపించెద వేల! ఎంత విలపించినను మరణించినవారు మరల వత్తురా? జననమరణములు ప్రతివానికి నున్న వేకదా!

బ్రాహ్మ—రామా! విష్ణ్వంశసంభూతుఁడగు శ్రీరామచంద్రుఁడు రాజ్యమేలుచుండఁగా, భూసుర బాలకుండకారణముగ మృతిజెందెనను నపవాద నీవు భరించి యనుచరులను, దమ్ములను, నిరంతరమును సేవింప నాచంద్రార్కముగ సౌఖ్యశ్రీల నందుచు జెలంగుము. ఇక్ష్వాకులవంశజుల పరిపాలనమున నిట్టియకాలమృత్యు వెప్పుడును నెఱుంగము. అయ్యది. యిప్పుడు నీపరిపాలనమున వాటిల్లెను. బాలున కగ్నిసంస్కారము జేయుట నాకుచితముగాదు. కావున నేనును నాభార్యయుం గూడ శరీరములద్యజించెదము. ఈ మూఁడు హత్యల ఫలంబును నీవు గాంచి సుఖంపుము.

శ్రీరా—బ్రాహ్మణోత్తమా! ఇంచుక యూరడిల్లుము, (వసిష్ఠునిఁజూచి) మునీంద్రా! ఏమి యీ ఘోరము ఈ బ్రాహ్మణోత్తముఁడు నన్ను నిందించుచున్నాఁడే నేనేమి చేయుదును?

వసి—రామచంద్రా! నానాటికి ధర్మము తగ్గుచున్నది. యుగయుగమున గలుగుచున్న మార్పులనివినియు నిప్పుడు నీకుఁ జెప్పుచున్నచోఁ గాలవిలంబనమగును. ఇప్పుడు నేను తపోదృష్టినిఁ జూచితిని ఇచ్చటకు సమీపారణ్యమునం దే యొకశూద్రుఁడు పరమనిష్ఠఁబూని ఘోరతపము జేయుచున్నాఁడు. కావున నీవు కాలవిలంబము సేయక యాశూద్రుని వధించి యాబ్రా

హ్మణకుమారుని బ్రిదికింపుము. రామా! రాజధర్మము పచించితివిగాని నీకుదెలియని ధర్మము లేమున్నవి?

తే. గీ. "రామ"యని చిత్తమున నొక ♦ మారు నిన్ను
సంస్మరించినఁ బాపముల్ ♦ సమసిపోవు
నట్టిచో నీకు నసల్ప కా ♦ ర్యంబుగాదె
బాలకుని వీని బ్రికికించి ♦ పఱలుమన్న.

శ్రీరా—(బ్రాహ్మణుని జూచి)

తే. గీ. బ్రాహ్మణోత్తమ! సంతాప ♦ భరము విడుపు
నీకుమారుని బ్రతికించి ♦ నెగడువాఁడ
బ్రతుక జేయక యున్న నా ♦ ప్రతిన వినుము
నేను విడిచెద దేహంబు ♦ నిశ్చయముగ

(లక్ష్మణునిఁజూచి) లక్ష్మణా! నీవాధరామకునకు ధైర్యముఁజెప్పుచు తత్తనయుని శరీరము సుగంధతైలమున సురక్షితముగ జేసియుంచుము భూసురకుమార ప్రాణసంరక్షణార్థమై శూద్రతాపసవధోద్యోగభాగమునవహించి నేనరిగి వచ్చెదగాక.

లక్ష్మ—చిత్తము

శ్రీరా—(నిష్క్రమించుచు,

లక్ష్మ—(భూసురునిఁజూచి) భూసురోత్తమా! శోకము మాని యీకళేబరంబు నిటు డోడ్కొనిరమ్ము. శ్రీరామాజ్ఞ ననుసరించి సుగంధతైలమున సురక్షితము నేయవలయును.

బ్రాహ్మణుఁడు బాలుని కళేబరము గొనిపోవును. అందరు నిష్క్రమింతురు.

❀❀❀(౦)❀❀❀

రంగము—అరణ్యము శంబుకుఁడు తపము సేయుచుండును.

(ప్రవేశము-శ్రీరాముడు)

శ్రీరా—(తపము సేయుచున్న శంబుకునిఁ జూచి) ఆహా! ఈతఁడెవ్వఁడో కదా! యధోముఖుఁడై తపము సేయుచున్నాడు. ఈతనితపము మహాద్భుతము గలిగించుచున్నది. ఎవ్వరో యారయవలయును (శంబుకుని సమీపించి)

మ. అనఘా! యెవ్వఁడ వెట్టికార్యమునకై ♦ యత్యంతనిష్ఠన్ మనం
బున నీరీతిని యిన్నాని దపం ♦ బున్ సల్పుచున్నావు నా
కును విస్పష్టము సంతసంబుగను నీ ♦ కోర్కెన్ మహాశ్చర్యమై
దనరన్ నీతప మిట్టిభంగి ధరణిన్ ♦ గావింపలే రెవ్వరున్.

నేను దశరథపుత్రుఁడ శ్రీరాముఁడను.

శంబు—(కన్నులదెఱచి) అర్కకులవారాశిచంద్రా! రామచంద్రా! భవదీయదివ్య మంగళవిగ్రహ సందర్శనమున నేను ధన్యుఁడ నైతిని. సముద్రబంధన సమయమున నిన్ను సేవించుచు వెంట నరుదెంచిన కపులకన్న నెక్కుడు ప్రేమతో నుడుతను లాలించినావు. పరమనిష్ఠాగరిష్ఠులై తపంబొనర్చిన మునీంద్రులతో సమానము జేసి పక్షినాథుఁడగు జటాయువునకు మోక్షంబొసంగినావు. రావణవధానంతరంబున నయోధ్యకు మరలివచ్చుచు, భరతునికన్నను ముందుగాఁ గిరాతనాథుఁడగు గుహుని క్షేమ మరయ హనుమంతుని బంపినావు. భరద్వాజ మునీంద్రుఁడును. శబరియిచ్చిన పండ్లను నొక్కరీతిగ భావించినావు. నీవు సాక్షాద్రమానాయకుండవుగాని సామాన్య మానవుఁడవుగావు ధరాభారము బాపుటకిట్లిక్ష్వాకు వంశంబున నవతరించినావు. బ్రహ్మరుద్రేంద్రాది దేవతలు తావకాంశంబులు. (ఇంచుక యూరకుండి) దేవా! నాసంగతి నరయుదలంచి నీ

డుగ నేనసత్యమేల పలికెదను? నేను శూద్రుఁడను శంబు
కుండనువాఁడ బొందితోడ స్వర్గమునకరుగఁదలఁచి యిట్టి
ఘోరతపము సేయుచున్నాఁడ.

శ్రీరా—(తనలో) బ్రాహ్మణకుమారుని యకాలమృత్యువునకీశూ
ద్రుని ఘోరమైన తపమేకదా! కారణము అక్కటా! ఇప్పు
డు నాకేమిచేయుటకును దోచకున్నది

తే. గీ. పరమనిష్ఠను బూని యి ♦ వ్వనమునందు
ముక్తిఁబడయుఁగఁ గోరి య ♦ మోఘమైన
తపము గావించు వీనిని ♦ దయనువీడి
చంప జేతులాడునె నాకు ♦ సాహసమున.

(ఆలోచించి) ఏమైననేమి భూసుర కుమారుని ప్రాణరక్షణార్థమై
వీనిని వధింప వలయును వీనివధవలన నాకు పాపము సంభవింప
కుండుఁగాక (యొరనుండి ఖడ్గముదీసి శంబుకుని శిరము ఖండించును

( ఆ క స ము న )

రామచంద్రా! మేము దేవతలము నీవు రాజధర్మమును గాపాడుకొని
నందుల కెంతయు సంతసించితిమి. నీకృపాణముచే దెగిన యీ
శూద్రుఁడు దేహముతోడనే దివికరుగును. ఇంకనీకుఁ గావల
సిన వరంబొండు గోరుము

శ్రీరా—(ఆకసమువంక జూచి) ఓహో! దేవతలునాకుఁ బ్రసన్ను
లైరి? (ప్రకాశముగా మింటనున్న దేవతలజూచి) బృందారకు
లారా! మీరు నాయెడలఁజూపిన కరుణకు సంతసించితిని
మృతుండైన భూసుర కుమారుని బ్రతికింపుడు.

( ఆ క స ము న)

శంబుకుఁ డెప్పుడు నీచే దెగెనో యాక్షణముననే యా బ్రా
హ్మణబాలుడు సజీవుఁడైనాఁడు.

శ్రీరా—(తనలో) ఆహా! ఇప్పుడు నాకెంతయు సంతసము గలిగినది. శూద్రుని యభీష్టమూ దీరినది. బ్రాహ్మణాత్మజుఁడా జీవించినాఁడు. (ఇంచుక యూరకుండి) ఇంక నేనిక్కడఁ దడయనేల? పురమున కేగెదగాక. (నిష్క్రమించును.)

రంగము:—అయోధ్య—సభామందిరము.

(ప్రవేశము—శ్రీరామలక్ష్మణ భరతశత్రుఘ్నులు, వసిష్ఠుడు.

శ్రీరా—(వసిష్ఠునిఁజూచి) మునీంద్రా! యాగము జేయించుభారమంతయు నీదైయున్నది.

వసి—రామచంద్రా! నీ వావంతయు సందియ మందవలదు. సాక్షాద్విష్ణుడవగు నీవొనర్చు క్రతువుల కేవిధమగు భంగము కలుగదు. బంధువులను మిత్రులను నానా దేశాధీశులను రావించి క్రతుదీక్షఁ బూనుము. యజ్ఞప్రారంభమునకు ముందు యజ్ఞ బిరుదు పట్టముగట్టి యశ్వమును భూచక్రమెల్లఁ జరించిరా విడువవలయును. అయ్యది యెవ్వరిచేతనైనను బట్టుపడెనేని క్రతువునకు భంగమొదవును.

శ్రీరా—మునీంద్రా! క్రతువాజివెంబడి శత్రుఘ్నుండరుగును. బంధుజనులను బిలుచుటకు భరతుండేగును. జనక మహారాజును దోడి తెచ్చుటకు సౌమిత్రినిఁ బంపుదును (లక్ష్మణునిఁజూచి) లక్ష్మణా! సుగ్రీవ హనుమదాది వానరులను, విభీషణుని సత్వరముగ రావింపుము. (శత్రుఘ్నునిఁజూచి) తమ్ముఁడా? శత్రుఘ్నా! మాయాశ్వము వెంట నీవరుగుము. ఎవ్వరైన బరాక్రమమున విజృంభించి యశ్వమును బంధించిరేని దశకంఠవధచే గలిగిన పాతకము బోఁగొట్టుకొనఁ దలంచి యీమఖ మొనర్పఁబడుచున్నది గాని, నరపాలురయందు గొప్పవాడనని ఖ్యాతి

నందుటకుఁ జేయబడుటలేదని చెప్పుము. నీపలుకుల కశ్వమును బంధించినవారు వినక, యశ్వంబును వదలనిచో వారిపై నీదర్ప మంతయుఁ జూపక యేదోవిధమున భయపెట్టుము (భరతునిఁ జూచి) భరతా! మనబంధువులను, సకలనృపాలురను, యాగముజూడరమ్మని వినయపూర్వకముగ బలికి తోడితెమ్ము. లక్ష్మణునిఁ(జూచి) సౌమిత్రీ! జనక మహారాజుం దోడితెచ్చుటకు నీవే తగినవాడవు. నీ వామహాత్మునితో నా పలుకులుగా నిట్లు చెప్పుము.

శా. కూతుంగానకు బంపినాడనిమహా ♦ క్రోధంబునొక్కింతయున్
జేతంబందున బూనకుండ గరుణా ♦ సింధుండవై యజ్ఞమున్
బ్రీతింజూడగ నేగుదెంచి యశమున్ ♦ జేకూర్పుమా నాకు, నా
చేతంబందున నిన్నుఁ దండ్రివలెనే ♦ చింతుంగదా భూవరా.

తే. గీ, పృథ్వీపుత్రిక యుండిన ♦ బిలువకుండ
వచ్చియుందువు నీవె భూ ♦ పాలచంద్ర!
యామెలేనప్డువచ్చి నీ ♦ యలఘు కరుణ
జూపవలె నావయినఁ బరి ♦ శుద్ధమతిని.

లక్ష్మ—అనయ్యా! అట్లనేచెప్పెదను.

శ్రీరా—మునీంద్రా! మన మరుగుదము.

(అందరు నిష్క్రమింతురు.)

ఇది తృతీయాంకము.





శ్రీ

# సంపూర్ణోత్తరరామాయణము

## చతుర్థాంకము,



రంగము—వాల్మీకాశ్రమప్రాంతవనము.

[లవుడును, గాలవుడును, మునిబాలుడును ప్రవేశించుచున్నారు]

లవు—మిత్రమా! గాలవా! యీవనంబుననున్న విశేషమేమియో కంటివా!

సీ. పగయంత దిగనాడి ♦ వరకురంగములకుఁ
బాలిచ్చుచుండెడి ♦ వ్యాఘ్రసమితి
భీతియింతయు లేక ♦ ప్రీతితో హరులతోఁ
గలిసి చరించెడి ♦ గజచయంబు
పరమహర్షముతోడ ♦ బావురుపిల్లితోఁ
గలిసియుండెడి మూష ♦ కప్రకరము
జంకుబూనక యింతి ♦ సాళువంబుల ముందు
పరుగెత్తుచుండెడి ♦ పక్షికులము

తే. గీ. గలిగి, చూచువారలకు నెంతో ♦ కనులపండు
వై దలరుచున్న యీమహా ♦ వనముగాంచి
నావ యిట్లుండఁ గారణం ♦ బరసినావ
మనగురుండగు వాల్మీకి ♦ మహిమసుమ్ము!!

గాల—మనగురుండు సామాన్యమహిమ గలవాడుకాడు. ఎంతటిపవి భావము గలిగినవాడు కాకపోయినచో, బ్రహ్మ యాతనినేల రామాయణ మహాకావ్యము రచించుటకు నియోగించును ?

లవు—మిత్రమా! రామాయణమనిన జ్ఞాపకమువచ్చినది. మనగురుడు వరుణ లోకమునకుఁ బోవుచు నేను మరలివచ్చునప్పటికి రామాయణములోని వెనుకటిశ్లోకములన్నియు జదివియుండు మని చెప్పినాడు. నేనాసంగతియే మఱచిపోయినాను. ఇదిగో ! గ్రంథము దగ్గరనేయున్నది. ఒక్కసారిచూచుకొందును.

శ్లో. మానిషాద ప్రతిష్ఠాంత్వ మగమశ్శాశ్వతీస్సమాః।
యత్క్రౌంచ మిథునా దేక మవధీః కామ మోహితమ్॥

(అనిచదువుచున్నాడు)

[తెరలో ధ్వని]

గాల—లవా! ఏదియో పెద్దధ్వనివినవచ్చుచున్నది.

లవు—(ఎదుటజూచి) అటుజూడుము. ఎవ్వరిదో యశ్వ మీదారిని బరుగెత్తుకొని వచ్చుచున్నది. దానిపాదసంఘట్టనధ్వనికి భూమి యదరుచున్నది. అదిగో! అయ్యది మనలను సమీపించుచు న్నది. దాని లలాటంబున నేదియో కట్టబడియున్నది. పోయి చూచెదగాక. (నిష్క్రమించి వెంటనేగుఱ్ఱముతో ప్రవేశించి) గాలవా ! చూచితివా ! దీని లలాటంబున నెట్టి బిరుదుపట్టంబు కట్టఁబడియున్నదో

తే. గీ. నవనహాయ మిద్ది మనవంశ ♦ జలధిశశియు
పినుదును నైన రాముచే ♦ విడువబడియె
శూరులెవ్వరైన నున్నచో ♦ సొంపుమీఱ
దీనిఁ బట్టంగవచ్చును ♦ తెగువబూని.

... బడియున్నది.

గాల—లవకుమారా ! ఈ హయముతో మనకేమి పనియున్నది ? ఇయ్యది యే మహారాజుచేతనో విడువఁబడిన క్రతువాజి.

లవ—సఖుఁడా ! అట్లుగాదు. శూరులెవ్వరైన నున్నఁ బట్టుఁడని బిరుదపట్టమున వ్రాయఁబడియున్నది., నేను శూరుండనగుటచే దీనిని బంధించెద. ఎవరడ్డమువచ్చెదరో చూచెదఁగాక !

గాల—లవా ! మునికుమారులమగు మనకుఁ బౌరుషముతో నేమి పనియున్నది ? దీనిని నీవు బంధించితివేని మనకు ముప్పు వాటిల్లును. ఈ యశ్వ మొంటిగా నిట్లు వచ్చినదని తలంపకుము. దీనివెనుక ననేకమంది వీరులుందురు.

లవ—ఉండిన నుందురుగాక ! వారు నన్నేమి సేయఁగలరు ? శూరులున్నఁ బట్టవచ్చునని బిరుదపట్టంబున లిఖింపఁబడియే యున్నది కదా. నేను వీరుండను నేను బంధించెదను.

గాల—మిత్రమా ! దీనివలనఁ గలహము సంప్రాప్తించును. మనము కలహమున కర్హులముగాము. స్నానసంధ్యాహోమ జపతపంబులే మనకు ధర్మము.

లవు—సఖుఁడా నీవు భయమందకుము. (గుఱ్ఱమును దన యుత్తరీయముతో నొక వృక్షమునకుఁ గట్టుచున్నాఁడు)

గాల—లవా ! ఏమి నీ సాహసము ?

[అనుబంధము. 12.]

నీవు బాలుఁడవు. ఈ హయము నిట్లు బంధించియుంచితివేని వెనుక నుండి వీరులువచ్చి నిన్ను జుట్టుముట్టెదరు. అప్పుడు నీ వేమి సేయుదువు.

లవు—ఇదియా ! నీకుగలిగిన భయము. ఈ యజ్ఞహయమును విడచి నవాఁడు కౌసల్యాసుతుఁడఁట. ఆమె వీరమాతయఁట. కానిమ్ము

మాతల్లి మాత్రము యేల వీరమాత కాదో నేనేల వీరుఁడఁ గానో చూచెద !

చ. సవనహయంబుఁ బట్టితిని ♦ సాహసశౌర్యములుంట చేతనే
శివుఁడరు దెంచినన్ భయము ♦ జెందను నెమ్మది ; వామలూరుసం
భవుఁడిడినట్టి విద్యలవ్రి ♦ భావముఁ జూపఁగవచ్చు; వీరులన్
బవరమునందు దాకి సుర ♦ వర్గము మెచ్చఁగఁ బోరుసత్త్వరన్.

గాల—మిత్రమా! నామాటవినవా? ఇట్టి సాహసకార్యము నేల జేయ నిచ్ఛితివని మా యమ్మ నాపై నాగ్రహించును.

లవు—గాలవా ! ఈ విషయమున నీకు దెలియదు. (ఎదుట జూచి) అదిగో ! ఎవ్వరో వచ్చుచున్నారు.

[జయవర్మ—ప్రవేశించుచు.]

జయ—(లవుఁ జూచి తనలో) ఏమిది ! ఈ బాలుఁడెవఁడో కదా యశ్వమును బంధించినాఁడు. వేషమునుజూడఁగా మునికుమారునివలెను, ముఖలక్షణమునుజూడ క్షత్రియ బాలకునివలెను దోఁచుచున్నాఁడు. (ప్రకాశముగా లవునిఁజూచి)

తే. గీ. ముందు వెనుకలఁ జూడక ♦ మందగతిని
గ్రతు తురంగము నేటికిఁ ♦ గట్టినావు ?
బ్రాహ్మణుండవు గావున ♦ భావమందు
వాడమది యెంచఁ గినుక దీని ♦ విడువుమింక.

లవు—ఏమేమీ! బ్రాహ్మణుఁడను గావున నీకు నాపైఁ గినుక వోడమటేదా! ఏమి కరుణార్ద్రహృదయము! ఈమాటలతో నేమి పనియున్నది. ఈయశ్వమును నేను బంధించితిని. నీచేత నయ్యేనేని విడిపించుకొనుము.

జయ—బాలకా! నీసాహసముఁజూడ నాకు నవ్వువచ్చుచున్నది. బాల్యచాపల్యంబున నెఱుఁగక కట్టితివి. ఇంక దీనినివిడిచి పుచ్చుము

లవు—విడువవలయునను తలంపున్నచో బంధించుటయేల తటస్థించును? శూరులున్నచోఁ బట్టుడని దీనిముఖంబునఁ గట్టఁబడిన బిరుదపట్టంబు గాంచి నేనిట్లు బంధించితిని.

జయ—మునిబాలుండవగు నీకిట్టి సాహస మెట్లలవడెను?

మ. మునిబాలుండవు నీకు నేమి తెలియున్ ♦ భూరిప్రతాపుండు రా
జునియజ్ఞాశ్వము దీనిఁ బట్టదరమే ♦ ముక్కంటికిన్ సాహసం
బున బంధించుట కెంతవాడ వవురా ♦ భూమీసురుం డిట్టి చే
తను గావించుట యెంనుసైనఁ గలదే ♦ ధాత్రీతలంబందునన్.

లవు—బ్రాహ్మణులంత పరాక్రమహీనులనియా నీయభిప్రాయము?

మ. ధరలో నిర్వదియొక్క మారులు సమ ♦ స్తక్షత్రకాంతారమున్
బకిభేదించిన జామదగ్న్ని వినవో ♦ బాహాబలప్రౌఢిమన్
సరియెవ్వారతనిన్ జయింపగను నే ♦ బ్రహ్మాదులచేఁ గల్గె ని
ల్వర నీక్షాత్రత నాదుభూసురతయున్ ♦ బాల్యార వీక్షింపుమా

[వింట నారిని సారించుచున్నాఁడు.]

జయ—(తనలో) యేమి! యీ బాలుని ధైర్యము! ఈతఁడు సామాన్య మునిబాలుని వలెలేడు. కాకున్నచో నీతఁడేమి! యజ్ఞాశ్వమును బంధించుటేమి! (ప్రకాశముగా) మునికుమారా! నీ వాక్యములు నీ వయసునకు మించియున్నవి. బరశురాముని గూర్చి యధికముగాఁ బలికితివి.

తే. గీ. పరశురాముని నని భంగ ♦ పఱచినట్టి
వీరుఁడైన శ్రీరామ పృ ♦ థ్వీపతి విడిచి
నట్టి ఘనమఖవాజియై ♦ యలరు నిద్ది
దీని బంధింప నీకిట్టి ♦ తెగువ తగునె ?

చాలు. చాలు. (గుఱ్ఱమును కట్టిన వృక్షమును సమీపించుచున్నాఁడు)

లవు—(అడ్డముపోయి) సాహసింపకుము.

తే. గీ. శౌర్యముండుటచేతనె ♦ సాహసించి
బట్టినాడను నీ కత్తు ♦ నాజి నిపుడు
ఫీకు లెవ్వరైన నేతెంచి ♦ ఘోర రణము
సలిపి దీనిఁ దోడ్కొని ♦ చనగవలయు.

అంతియే గాని, బంధించిన యీ హయమును నేను మాటలతో విడుచువాఁడఁగాను.

జయ — విలుతవాడవగు నీవాక్యములు నాకు నవ్వు బుట్టించుచున్నవి. ఇంక నీ ప్రగల్భవాక్యములాపి గుఱ్ఱమును విడువుము.

లవు — నాకు మాటలతోఁ బనిలేదు.

ఉ. చిచ్చఱకన్నునందెఱచి చేత ❘ త్రిశూలముతాల్చి రుద్రుఁడే
వచ్చునుగాక యియ్యెడకు; ❘ స్వాంతమునన్ భయమందకుండ స
స్మచ్ఛితులాస్త్రసంతతుల ❘ సంగర భూమిని జిమ్మువాఁడ; నీ
నచ్చినమాటలేటికి ర ❘ ణంబునకున్ దిగుశక్తి గల్గినన్.

జయ — నీవు నాతో రణముజేయఁదలఁచితివా? గుఱ్ఱమును విడువవా?

లవు — విడువను. ముమ్మాటికిని విడువను.

జయ — బాలుండవగు నీతోఁ బోరుటకు నాకుఁ జేతు లెట్లాడును? నాచేత నొప్పింపఁబడితివేని నీ తలిదండ్రులు నీకై యెంతగుందుదురో?

లవు — ఈ ప్రీతిమాటలవిడువుము. నీచేతనైనచో గయ్యమునకురమ్ము లేదేని తొలగిపొమ్ము.

జయ — (తనలో) ఈ బాలుఁడెవరోగాని హయమును మాటలతో విడుచునట్లు లేదు. ఒక్క శరమును బ్రయోగించి భయపెట్టి చూచెదగాక! (ప్రకాశముగా) అట్లనా! కానిమ్ము. హయమును గొనిపోవుటకు నీవు మార్గమీయక పోయినచో నాశరమైనను మార్గమునిప్పింపక యుండునా? (శరప్రయోగము సేయును)

లవు—(శరము ఖండించి) ఇదిగో! నా శరమును గాచుకొనుము.

(ప్రయోగించుచున్నాఁడు)

జయ—(తనలో) ఈ బాలుని శరసంధాననైపుణ్య మెంతయు నద్భుతంబుఁ గలిగించుచున్నది. అది యేమి కారణమో గాని బాలుఁడైన వీనితో సమరము సేయుటకే నాకు భయము గలుగుచున్నది.

[శత్రుఘ్నుఁడు—ప్రవేశించుచున్నాఁడు] [అనుబంధము. 13]

శత్రు—(తనలో) ఈ బాలుఁడెవరో హయమును బంధించెడమే గాక జయవర్మతో నిర్భయముగా మాటలాడుచున్నాఁడు. (ఎదుట జూచి మాటలేకాదు శరముధరించి నిలిచినాఁడు. ఆహా! ఏమి ఈ కుమారుని యాకారము!

మ. మొగమా! పూర్ణశశాంకకోటులను దె ♦ వ్వార్గన్నులా! యెంచఁగా
నగుఁ బద్మంబుల గంతలంబులను నె ♦ న్నన్వచ్చు నీలంబులన్ ;
సొగసౌ బాహువుల తీరు జూడ ఖళిరా ♦ శుండాలశుండంబులే
యగు; నీ బాలకుడెవ్వడో కద! యనూ ♦ నాశ్చర్యమయ్యెన్; మదిన్.

ఈతని ముఖవికాసము నన్ను సంపూర్తిగా నాకర్షించి, యొకవిధమగు ప్రేమను జనింపఁజేయుచున్నది. పలుకరించెదగాక. (లవుని సమీపించి)

చ. ఎవడవు నీవు యజ్ఞహయ ♦ మేటికిఁ గట్టితివయ్య రఘుభూ
ధవమణి దీని వీడనని ♦ తద్దయు నీమది దోచలేదె, మా
సవనము జూడ రమ్మికఁ ♦ బ్రశస్తవినూత్న చిరత్న చేలముల్
భవనము నిండ నీకొసఁగి ♦ భవ్యముగన్ భుజియింపఁ జేసెదన్

కుమారా! సాకేతపురాధీశుండగు శ్రీరామచంద్రప్రభువు చేసిన క్రతుతురంగము విడువఁబడినది. దీని నెవ్వరును బంధింపరాదు. మునిబాలుఁడవగు నీవిది యెఱుంగక పట్టితివి. ఇంక విడిచిపుచ్చుము. క్షత్రియార్హమైన కార్యము బ్రాహ్మణవటువగు నీవు చేసినందులకు నవ్వు వచ్చుచున్నది.

లవు—నీముఖలక్షణముచూడగా నీ వొక రాజేంద్రుడవని తోచు చున్నది. అయిననేమి ! ఈ హయమునకు లలాటంబునఁ గట్టఁ బడియున్న బిరుదపట్టముజూచి నేను దీనిం బట్టితిని. నేను బ్రాహ్మణుఁడనైననేమి ! మునికుమారుఁడనైననేమి ! బాహుబల శౌర్యవిక్రమంబులు ప్రధానము.

శత్రు—వత్సా ! నీచిన్నతనపుమాటలను విడువుము. ఈహయముతో నీకేమియు బనిలేదు. నావెంట సాకేతపురమునకు రమ్ము శ్రీరామచంద్ర నృపాలసార్వభౌము డశ్వమేధ యాగమును జేయుచున్నాడు. నీ యిచ్చవచ్చునట్లు భుజింపజేసెదను. వలసిన రత్నాంబరముల నిప్పించెద. ఇంతియేగాక, నీకు నశ్వమే కావలసియున్నచో వేఱొకదాని నిచ్చెద దీనిని విడువుము.

లవు—ఇవి యన్నియు మాకేల ? రాజువుగావున నిట్టి దానముల జేయఁగలవు

తే. గీ. ఆహవంబును గోరియే ♦ హయమునిట్లు
సాహసంబున బట్టితి ♦ క్షాత్రతేంద్ర !
భవుడువచ్చిన మదిలోన ♦ భయముసంద
మాటలేటికి వేగమే ♦ మరలు పురికి

శత్రు—

ఉ. బాలుఁడవువిప్ర క్షత్రియుల ♦ భంగు లెఱుంగవ భంగ సంగరా
భీలురమైన మామెడల ♦ భీతినొకింతయుఁ బూనకుండనే
యాలముగోరుచుంటివి హ ♦ యంబునుబట్టి, త్రినేత్రుడైనసు
జాలునె మమ్ముగెల్వగను ♦ సాహసమూనకు దాపసాత్మజా

మ వరమాణిక్యములో మహారథములో ♦ వస్త్రంబు .. మాడలో
.రులో గాంచనమో తురంగితతియో ♦ గాకున్న నింకేదియే

ధరణీదేవకుమార! యిచ్చెదను మో ♦ దంబారగ్గ కొంచు, నీ
తురగంబుఁ విడనాడుమయ్య యిఁక దోడ్తో జేరుదుఁ మాపురిఁ.
కుమారా! మందిరంబులుగాని, భూషణంబులుగాని గోరుకొనుము.

లవు—

సీ. కంద దుంపల మెక్కు ♦ కొన్మ దేవులగు మాకు
నవరస పాయసా ♦ న్నంబ దేల,
నారలంగట్టి యిం ♦ పారఁదిరుగు మాకు
మణిమయభూషణాం ♦ బరము లేల,
వనములందిరుగుచు ♦ వరలుచుండెడిమాకు
స్థిరముగానుండు మం ♦ దిరము లేల,
ఘనతపోవృత్తిసిఁ ♦ గాలుచుండెడి మాకు
జనులుండు నగర వా ♦ సంబ దేల,

తే. గీ. ఎంత దూరంబునైన నొ ♦ కింత శ్రమము
నందక నడువ గల మాకు ♦ హయము లేల
స్యందనము లేల మదసామ ♦ జంబు లేల
వంతమే మాకు ముఖ్యమై ♦ పరగు భూప!

నేను బంధించిన యీహయంబును నిప్పుడు విడిచి నీవెంటఁ బురంబునకువచ్చితినేని, యచ్చటి వారెల్ల నన్నుజూచి నవ్వరా! మన మిరువురమును సంగ్రామ కేళిలోఁ దేలినపిమ్మట వలయునేని బురంబునకు బోవచ్చును.

ఉ. ధీరుఁడుగాడు, మౌని, వన ♦ దేశనివాసి; మహారణంబులోఁ
బోరఁగలేడు వీడనుచు ♦ బుద్ధి విచారణసేయవద్దు, నీ
పౌరుషముఁ బరాక్రమము ♦ భండనపాండితి నేడుచూపు, నే
వీఁగుడ నంచు జెప్పుచును ♦ విల్లు కరంబునఁబట్టినిల్చితిన్.

సంగరరంగంబునఁ జచ్చినను బ్రతికినను గీర్తియే లభించును,జయము

నకుఁగాని నవజయంబునకుగాని నేను వెనుదీయువాడనుఁ గాను. వాల్మీకి మహామునీంద్ర కృపాసమాసాదితాస్త్ర విద్యాధురంధరుఁడ నగు నేను నీవగాక చతుర్దశభువనంబు లెత్తివచ్చినను భయంబందను.

శతు్రు— మునికుమారకా! నీవునామాటలు పెడచెవిం బెట్టిరణమే పరిధానమని చెప్పుచున్నావు. యుద్ధమనఁగా నేమిగాఁ దలంచితివి ?

సీ. ఘోంటక స్యందన ♦ కుంజరంబులుగాని ;
వనులనుండు కురంగ ♦ పంక్తిగాదు
అగ్నిజమ్మోడి మహా ♦ దస్త్రసమితిగాని
పూజార్హమైనట్టి ♦ పూలుగావు
ఘనరక్త సిక్త సం ♦ కాశకాయముగాని
పాలుపారధరియింప ♦ భూతికాదు
సింహాద్ధ వీరుల ♦ పికిరిమార్భటిగాని,
కోర్కె సించెడివేద ♦ ఘోషగాదు

తే, గీ. పలనాతోడఁ గ్రహింప ♦ నెంతునయ్య
తోడిబాలురఁ గూడుచు ♦ నాడుకొనగ
బొమ్మసంతోష మందె మీయమ్మ ముదిసి
బాలకా! కయ్యమేటికి ♦ వలదు వలదు.

సీ ముద్దయ్యె నీనగు ♦ మోము వీక్షింపగ,
వర శరాశనమెట్లు ♦ బట్టువాడ
కణుగలిగెను నీ ♦ కాయంబు తిలకింప
సంగరంబే రీతి ♦ జరుపువాడ
సనురాగ మొలకెనే నీ ♦ యాత మ్ముదోక్కుజూడ
వాడి బాణము లెట్లు ♦ బరపువాడ

నానందమూయె బా ♦ ల్యంపు చేష్టలఁ జూడ
గూరత నిన్నట్లు ♦ గూల్చువాఁడ

తే. గీ. ఏడనీ వేడ సమరం బ ♦ దేడ: శరణుఁ
బొందు మిక నిఁక బోచి మా ♦ పురమునకును
దోడ్కొనుచు బోవువాఁడ సం ♦ తోష మెసఁగ
నచట గలయట్టివింతల ♦ నరయవచ్చు

లవు—రాజా! పౌరుషహీనమైన వాక్యముల నేల పలికెదవు?

ఉ. పోరుటమాని వాఁడిగొని ♦ పొమ్మని చెప్పను, తల్లిఁ జూడఁగిఁక
జేరను బోవుమా యనుచు ♦ నీ శరణంబును బొంద: వస్తువుల్
గోరను: తోడిబాలకులఁ ♦ గూడను నాటల వేయునేటికిఁ
బౌరుషసాహసంబు లెడఁ ♦ బాయవు నామది నెన్ని చెప్పినన్.

శత్రు—అట్లనా! నాశరముల వేడిమి నీకు దగిలినఁగాని తెలియదు.

[ అ ను బ ం ధ ము. 14 ]

లవు—[అనుబంధము. 25 ) ఇదిగో! నేను సంసిద్ధుఁడనై యున్నాడను. నేను విడిచెడి యీశరము నామహిమ నీకుఁ జూపును గాక! (శరమును విడుచును.)

శత్రు—(శరమును ఖండించి. తనలో ) ఓహో! ఏమిది! ఈతఁడ సమానాస్త్ర విద్యాధురంధరునివలె నున్నాఁడు. ఈతని యెడల నేను నిర్లక్ష్యముగా నుండరాదు. (ప్రకాశముగా) ఇదిగో! ఈశరమును గాచుకొమ్ము. (శరము ప్రయోగించును.)

లవు—హా! (మూర్ఛిల్లును.

శత్రు—ఆహా! ఈమునికుమారుడు నా బాణప్రహారమున మూర్ఛిల్లినాఁడు. అరెరే! మునిబాలకా! నే నెంతచెప్పినను వినవైతివి.

చ. కలకలలాడు నీనగు మొ ♦ గంబును, గన్నుల యందచందముల్
లలిత వయోవిలాసమును ♦ లక్షణముల్ ఘన దేహకాంతులున్
దలఁచి త్వదీయమాత యటుఁ ♦ దద్దయు జింతను బొందునో కదా
యిలపయి నిన్నుఁ గూల్చితి ని ♦ కేమి యొనర్తును దాపసాత్మజా

కారణమేమో నేనూహింపఁ జాలను గాని యీకుమారుని యెడ నాకు, బుత్రవాత్సల్య ముదయినది. ఇప్పుడు నే నేమనుకొన్న నేమి లాభము? (పడియున్న లవునిఁ జూచి) ఈతఁడు మూర్ఛయందు మునింగినాఁడు. కానిమ్ము. నేను వీని శ్రీరాముని సన్నిధిఁ జేర్చెద. (లవుని రథముపైఁ బెట్టుకొని హయములో నిష్క్రమించును.)

గాలవుఁడు—(ప్రవేశించి) అయ్యో! అమ్మో! ఆ రాజేంద్రుఁడు మా లవుని మూర్ఛపుచ్చి రథముపైఁ బెట్టుకొని పోవుచున్నాఁడు. మాగురుండగు వాల్మీకిగూడ యాశ్రమంబున లేడే. సత్వరముగ నేనరిగి యీవార్త సీతామహాదేవి కెఱిఁగించెదఁగాక! (నిష్క్రమించును.)



రంగము:—వాల్మీకాశ్రమము.

(మూర్ఛలో నున్న సీతయు—గాలవుఁడు ప్రవేశము.)

గాల—అక్కటా! నేనా లవకుమారుని సంగతి, దెలిపినంతనే యీసాధ్వి మూర్ఛనందినది.

(అనుబంధము. 16)

సీత—(మూర్ఛనుండి లేచి) హా! లవకుమారా! సంపూర్ణపూర్ణిమా చంద్రమండలమును ధిక్కరించు నీముఖమును దిలకించి నంతనే యెవ్వరైన ముద్దుపెట్టుకొనకుందురే అట్టిచో నీపైఁ గఠినశరంబులఁ బ్రయోగించుట కాభూపాలుని చిత్తమెట్లు సమ్మతించినది! వత్సా! బాలుండవగు నీ వారాజేంద్రు నేల యెదిరించితివి?

చ. ననుగన తండ్రి నీమొగము ♦ నాకును జూపితి వేని సాహసా
సన తలపోసి శౌర్యమున ♦ యజ్ఞహయంబును బట్టి వీరుఁడా
జనపతిచేతఁ గూలితివె ♦ సాహస మిట్టులఁ జేయవచ్చునే
వనములనుండు వారలకు ♦ బాగుప మేటికి బుత్రరత్నమా!

విధివశమున భర్తచే విడువబడి యరణ్యముల పాలయినను మీయిద్దరు కుమారులను జూచుకొనుచు నా దుఃఖమును గొంత మ్రింగియుంటిని. నాయనా! నీవు నేడిట్లయితివి నే నేమి సేయుదును నాకు బ్రొద్దుపోవుటకు నీవాడు మంకు నీముద్దుమాటల నెట్లు మరతును. అనుదినంబును నరణ్యమున కరిగి నాకొఱకు శ్రమపడి ఫలంబులును, పుష్పంబులును గొని తెచ్చి యిచ్చు నీ ప్రేమ నిప్పుడేమి చేసితి? ఒక్క నిమిషమేని యెడబాసి యెరుగని నీయన్నను విడుచుటకు నీచిత్తమెట్లు సమ్మతించినది?

సీ. నినుబాసి నేనెట్లు ♦ నిలువనోపుదునయ్య
కాననంబులయందు ♦ గన్నకొడుక
మిము జూచియేకదా ♦ మ్రింగియుంటిని చిత్త
మందున దుఃఖంబు ♦ నాత్మజాత
యన్నయ్య యే తెంచి ♦ యనుగు దమ్ముని జూపు
మంచు నడిగిన నే ♦ మందు బుత్ర
వనమందు జరియించు ♦ వాడవు నీ వేల
హయము బంధించినా ♦ వయ్య తనయ
తే. గీ. బట్టితివి గాక నిన్ను భూ ♦ పాలవరుడు
విడువు మని చెప్పి నంతనె ♦ విడువకుండ
సాహసించితి వేటికి ♦ శౌర్యమునను
లలితకందర్ప శృంగార ♦ లవకుమార

తండ్రీ! బాల్యవయస్కుండవగు నీతో ఘోరసమరము సేయ సాహసించిన యా రాజేంద్రు డెవడో కదా!

సీ. జనక భూపాలు హ ♦ స్తములబెరింగినదాన
నయ్యు నిట్టడవుల ♦ నడలవలసె
దశరధమేదిని ♦ ధవు పెద్దకోడల
నయ్యు నిట్టివగపు ♦ నందవలసె
రవివంశవరాశియైన ♦ రాముని సతి నయ్యు
ఘోరసంకటములరఁ ♦ గుందవలసె
పుణ్యచారిత్రులౌ ♦ ముగ్గురు మఱదులకు
వదినె నయ్యును నిట్లు ♦ వగన వలసె

తే. గీ. అక్కటా! పూర్వజన్మంబు ♦ నందు నెట్టి
పాపమాచరించితినో యీ ♦ భవము నందు
నిన్నుఁ బాయంగఁగంటిని ♦ కన్న కొడుక!
యేమి చేయుదు నింకనా ♦ కేమి తెరువు!

హా! లవకుమారా! మూర్ఛమునింగిన నిన్నుఁదన రథముపైఁ బెట్టుకొనిపోయి యా భూపాలుఁడేమిచేసెనోకదా! తండ్రీ! నీ విట్లయితివని వినిన నాశరీరమునుండి యింకను బ్రాణములు పోవక యున్నవి.

గాల— సాధ్వీమణీ! ఊరడిల్లుము. కుశకుమారుండరుదెంచి కర్తవ్యములు విచారింప గలడు.

సీత— తాపసకుమారా! ఇంక నేమి కర్తవ్యము;

తే. గీ. బాలుఁడంచును నైన భా ♦ వమునఁదలపు
బూనక, సుకుమారు, సుతుని ♦ మూర్ఛబుచ్చి
రథముపై నిడుకొని యేగె ♦ రాజవరుడు,
చిన్నికొమరు నేనింక వీ ♦ క్షింపఁగలనె!

(కుమారుని నుద్దేశించి) హా! వత్సా! నాయాకలిదీర్చుటకర్యణమున

కరిగి పరిపక్వఫలంబుల నింకెవ్వరు తెచ్చి యిచ్చెదరు ! నాకు దాహము నకై యనుదినంబును విమలభాగీరథీసలిలంబు లెవ్వరు దెచ్చి యిచ్చె దరు? తల్లీ ! నా విక్రమంబును జూడుమని చెప్పి యరణ్యంబున నున్న సింహవ్యాఘ్రాది సత్వంబులఁ బట్టి తెచ్చి యాశ్రమము వుందింకె వ్వరు గట్టు చుందురు ?

ఉ. హా సుకుమార! హా వరగుణాకర! హాజిత చంద్రబింబ! హా
మోసముఁజేసి మెచ్చుటికి బోయితివయ్య, వనాళి లోపలన్
గాసి వడంగ నేటికని కాయము బాయఁదలంచి యుద్ధముం
జేసి నృపాలుతోడ, నటుఁ జిక్కితివా ! ననుఁబీడి నందనా !

[కుశుఁడు—ప్రవేశము.]

కుశు—(తనలో) ఏమిదీ! ఈయాశ్రమ మంతయు నేఁడు చిన్నబోయి నట్లున్నది.

సీ. అనుదినంబును వేడ్క మునిసుతుల్ జడినెడి
వేద పాఠములేల వినఁగరావు
నను జూచినంతనే మునికన్యలందఱుఁ
జేరు చుండుట కేమి కారణంబొ
భూరిమోదముఁగూర్చు ముద్దుతపస్విదేల,
యాటలాడక యుండె నాశ్రమమున
ఏను వచ్చిన జాడ నెఱిగి యెదురుగ వ
చ్చెడి తల్లినన్నేల జేరకుండె
తే. గీ. మునికుమారకు లెల్ల నా మోముఁజూచి
శిరము లెత్తక యుండిరి చింతబడుచు
గారణం బదియేమియో కానుపింప
దేమియును గోచరమ్మది హృదయమందు.

నాచిత్తమంతయు గలత నందుచున్నది. (ఇంచుక నడచి) ఇదిగో :

నాతల్లి యిచ్చట నున్నది! ఏమి కారణమోగాని, యీమె మిగుల విచారమున మునింగి యుండినట్లు గనంబడుచున్నది. సమీపించి కారణం బరసెదంగాక. (సీతను సమీపించి) అమ్మా!

చ. కనులను నీరు కాలువలు । గట్టగ నెందుల కేడ్చెదమ్మ! నా యనుజుడు గానరాడటకు । నాటల కేగెను జెప్పుమమ్మ; యీ మునిసుతులెల్లం నన్నుంగని । మోములు వంచిరదేల! నామనం బునం బరితాప మార్చు పరి । పూర్ణతరంబగు భక్తిమొక్కెదన్.

సీత—(కుశునింజూచి) నాయనా! కుశా! వచ్చితివా? ఏమిచెప్పుదును నీతమ్ముండగు లవకుమారుండు గాలవునితో వనప్రాంతమున కేగంగా నచ్చటి కొక యజ్ఞహయము వచ్చినదంట. గాలవుడు వలదనుచున్నను లవుండు దానిని బంధించెనంట అంతట నెవరో యొక భూపాలుం డరుదెంచి లవునితోం గయ్యమొనరించి వానిని మూర్ఛబుచ్చి తన రథముపైం బెట్టుకొని పోవుచున్నాం డంట. తండ్రీ! ఇంక నే నెట్లు బ్రతుకుదునోయి

కుశు—(లవుని నుద్దేశించి) హా లవా! (అనుబంధము. 17)

తే. గీ. పూర్ణచంద్రుని బోలు నీ । మోముంజూచి
కరుణ వహీయించు నెంతటి । కఠినుండైన
నట్టిచో నిన్ను గృపలేక । యాహవమున
భూమినాథుం డేరీతి నిక । మూర్ఛబుచ్చె?

(తనలో) నే నిప్పుడు తమ్ముని గూర్చి యధికసంతాప మందినచో నాతల్లి మఱింత శోకించును. వాల్మీకిమహాముని కృపావర్ధముడగు నాతని కొక్కింతయు హాని సంభవించియుండదు. ఇప్పట్టున నేను నాతల్లిని నూరడించి సత్వరముగా బోయి తమ్ముని తన రథముపైం బెట్టుకొని పోవుచున్న నృపాలుని గలిసికొని యాతని దర్పమడంచి తమ్ముని దోడ్కొని వచ్చెదంగాక. (ప్రకాశముగా) అమ్మా! నీవు శోకింపవలదు-

తే. గీ. వామలూరు సంభవసత్కృ । పాసమార్జి
తాస్త్రవిద్యాధురంధరుం । డగుచునొప్ప
లవుని నేవీరు,డైనఁగూ । ల్పంగఁగలఁడె
మూర్ఛయైయుండునయ్యది । పోఁగలనేఁ

నీవు దుఃఖమును విడిచి ధైర్యమును నుండుము.

(అనుబంధము. 18)

చ. అరదముమీఁద నాయనుజు ♦ నావిధి దోడ్కొని పోవుచున్నయా
ధరణిపుఁ దాకి నాదుభుజ ♦ దర్పమెలర్పఁగ బోర నేలపై
నొరగఁగఁజేసి యాయుధము, నొప్పఁగఁదమ్ముని దోడితెచ్చెదన్
గురుతరధైర్యముం గనుచు ♦ గుండకయుండుము మానసంబునన్

సీత—నాయనా! కుశా! నాకు మఱియొకశోకమును దెచ్చిపెట్టెదవా? నీవైన నుండుము నీవేడ! ఆరాజేంద్రునితోఁ బోరుటేడ! మిమ్ములను జూచుకొని నేనెట్లో దుఃఖమును మ్రింగి యీకావనంబులయందు జీవయాత్ర సలుపుచుంటిని.

కుశ—తల్లీ! నీవు నావిషయమై సందియ మందవలదు.

చ. శరమును బూని హస్తమున ♦ సాహసమేర్పడ నిల్చియున్న సం
గరమునఁ బన్న దాకుటకుఁ ♦ గాలునికైనను శక్తిగల్గునే
పురహరు డేగుదెంచినను ♦ బోర జయింతును భీతయేల? స
త్వరగమనంబునన్ లవుని ♦ దప్పక తెచ్చెద నాజ్ఞనీయుమా.

అమ్మా పదునాలుగులోకములును నేకమైవచ్చినను రణంబునకునీకుమారుఁడగు కుశుఁడు భీతిల్లువాఁడు గాఁడని యెఱుఁగుము. (ఇంచుక యూరకుండి) జననీ! ఆలస్య మొనరించుటకు నాచిత్త మణుమాత్రమును సమ్మతింపకయున్నది. వైరినిగెల్చి తమ్ముని దెచ్చుటకుఁబోవు నాకు నీమహదాశీర్వచనం బొసంగి పంపుము.

సీత—వత్సా! కుశా! నీ ధైర్యమే నిన్ను రక్షించుగాక! వాల్మీకియొసంగిన నీయస్త్రవిద్యాప్రభావమున కెందును సాటిలేక యుండుఁగాక!

చ. జనపతి సత్య శాసనము ♦ సమ్మతి బాలన సేయనెంచి, య
వ్వనముల కేగువేళ రఘు ♦ వర్యున కాతని మాతయిచ్చు దీ
వనలె సదా నినుఁ గనుచు ♦ భవ్య సుఖంబులనిచ్చు పుత్రకా
యనిమిషులెల్ల నీకు జయ ♦ మబ్బఁగఁ జేకురు సంగరంబునన్

నినుఁద్రిమూర్తులును, సూర్యచంద్రాదులును, సప్తఋషులునురక్షించెదరుగాక! మఱియు

తే. గీ. అమృతము గొనితెచ్చుటకునై ♦ యరుగునట్టి
గరుడునకుఁ దల్లి వినత స ♦ త్కరుణతోడ
నిడిన మంగళాశీస్సులే ♦ కొడుక నిలచు
గాత నీయందు, విజయంబుఁ ♦ గాంచి రమ్ము

కుశు—తల్లీ! నమస్కారము నీవు లోనికేగుము (గాలవుని జూచు) గాలవా! ఆ రాజేంద్రుఁడు తమ్ముని రథముపై బెట్టుకొని పోయిన మార్గము జూపుదువుగాక! రమ్ము

(అందఱునునిష్క్రమింతురు)

ఇది చతుర్థాంకము



శ్రీ

# సంపూర్ణోత్తర రామాయణము.



## పంచమాంకము.

రంగము—వాల్మీకాశ్రమప్రాంతభూమి

[ప్రవేశము—ధనుర్ధరుఁడై కుశుఁడు.]

కవిరాజ విరాజితము.

నిలు నిలు మెచ్చటికేఁగెద విప్పుడు ♦ నేఁడిదె వచ్చితి, నీ
చలము బలంబును వేగమె చూపుము ♦ సంగర రంగమునన్
గలిత పరాక్రమ శౌర్యము లుండెను ♦ గాయుని తమ్ముని మూ
ర్ఛలనొనరించెదవా! నిను నిప్పుడఁ ♦ జంపకవీడుదునే?

[అను పద్యమును జదువుచు కుశుఁడు ప్రవేశించి తనలో]
అదిగో! ఆవచ్చు రథముపై నున్నవాఁడే కాంభోజ భూపాలుఁడు. (పరికించి) నందియ మేమున్నది? మూర్ఛనందిన తమ్ముఁడుగూడ నున్నాడు. రానిమ్ము.

[రథముపై శత్రుఘ్నుఁడు—ప్రవేశము.]

కుశు—(శత్రుఘ్నునిఁజూచి)

మ. పసిబాలుండగు నాదుతమ్ముని నసిన్ ♦ బాహాబల ప్రౌఢిమన్
వెస మూర్ఛిల్లగ జేసి యిట్లుడుగుదే వీరాధివీరుండవే

యసహాయుండగు శత్రుఘ్నునిపయి బా ♦ హాసర్పముఁ జూపుదే
కుశుఁడ! వచ్చితి నిన్నుఁ గూల్చుటకునై ♦ ఘోషింపనీ బాంధవుల్.

రథం బాపుము. నిన్నుఁ జేనొక యడుగైన నవతలకుఁ బోనీయక నీద ర్పమడఁచి నాతమ్ముని దోడ్కొని పోయెదఁగాక!

శత్రు)—— తనలో) ఈతఁడెవఁడు? నాశరములచే మూర్ఛనొందిన యీ మునిబాలుని వలెనే యున్నాఁడు ఇంత పసితనమునం దెవరికి శౌర్యసాహసంబు లెట్లు గలిగినవోకదా!

ఉ. బాలుఁడు చూడ రామనర ♦ పాలుని భంగిని దోఁచుచుండె, భూ
పాలసుతుండో కాఁడో, ముని ♦ వల్కల యాశ్రమ మందునుండు నీ
బాలుని సోదరుండగుచు ♦ భాసిలెనంచుఁ దలంతుఁ గానిచో
నాలము నేయ నాపయికి ♦ నద్భుతకార్యముతోడ వచ్చునే.

ఈ బాలుని ముఖము చూడ నాకధికానురాగము జనించుచున్నది. ఈతని తోడ నే నెట్లు సమర మొనర్తును? ఈకుమారుల నిజమైన సంగతియే తెలియలేదు. వీరి యాకారములు శ్రీరామచంద్రునిఁ బోలియున్నవి.

చ. వనమున రాముచేత విడు ♦ వంబడినట్టి విదేహపుత్రికిన్
జననము నొందినారనుచు స్వాంతమునం దలపోతుఁ గానిచో
మనసిజరూప చారు సుకు ♦ మారత గల్గిన వీరి మోములన్
గనినఁ గృపారసం బొదవె ♦ గాయిపుడెంతయు నాకుఁ జూడఁగన్.

ఇప్పుడు నేనేమి సేయుదును? రథము సాగకుండ నీబాలుఁ డడ్డము వచ్చి నిలచినాడు. యజ్ఞహయంబును గొనిపోకుండఁ బురంబునకేఁగితి నేని యాగము జరుగదు కానిమ్ము సామవాక్యములతో నీబాలుని మనంబు ద్రిప్పుటకుఁ బ్రయత్నించెదను. (ప్రకాశముగా) ఓయీ! మునిబాలకా!

చ. నిలునిలుమంచు నారథము ♦ నిల్పితి వెంతయు శౌర్యవృత్తినన్
గలన నెదుర్పగాఁగలవె ♦ కాంచితి వేకద! నీదు తమ్ముఁడున్

బడిన తెరంగు నంతయును ♦ బాహుషముఁ విడనాడి పొమ్ము ని
శ్చలగతి నాశ్రమంబునకు ♦ సంతసమందఁగ నీదు తల్లియుఁ
తాపసకుమారుడవగు నీకు మాతోఁ గలహ మేటికి?

కుశు —

ఉ. బాలుడ నంచు నెంచకుము ♦ భావము నందున నిదుపాలిటన్
గాలుఁడ నౌచు వచ్చితిని ♦ గావున ధైర్యము బూని నిల్వుమా
భీల రణంబునం దిపుడు ♦ భీతి జనించిన నన్ను వేడుమా
పాలన సేయవాఁడ నర ♦ పాలక చెప్పితి మాట లేటికిన్

శత్రు — అవురా ఎట్టి సాహసపు బల్కులు బలికితివి! నిన్ను నేను శరణంబు వేడవలయునా బాలుడా చాలుజాలు నీ వాక్ప్రహాము నొక్కింత యాపి నా మాట వినుము.

చ. లలితమృణాళపల్లవ వి ♦ లాసము మించెడి నీప్రశస్తబా
హువు నిటుద్రిప్పుచున్ బలుకు ♦ లొప్పఁగ నాకును ముద్దువచ్చెనా
కలిత పరాక్రమం బెటుల ♦ గన్పడ జేయుదు నిన్ను దాకి నా
పలుకుల విశ్వసింపు ముని ♦ బాలుర కేల రణప్రచారముల్.

చ. మనసిజహాస చారు సుకు ♦ మారకుమారుని నిన్ను జూడగా
ఘన కృప బుట్టె గారణము ♦ గాంచగనైతి నొకింత యుట్టిచో
నని మొన నిన్ను దాకి మహ ♦ దస్త్ర పరంపర పాలు సేయ నా
మన మెటుసమ్మతించు నను ♦ మానము వీడి వచించితిన్ సుతా

కుశు — రాజా సమరముఖము నుండి తప్పించుకొనిపోవుటకు బ్రయత్నింపకుము. నీవు నిజమైన వీరుండవేని రణంబున నిలువుము

[రథముపై నున్న లవుడు మూర్ఛనుండి లేచును.]

లవు — (తొందరగా లేచి రథముపై నుండి నేలకు లంఘించి శత్రుఘ్నుని జూచి)

మ. అనిలో మూర్ఛిలినంతమాత్రమున, నా ♦ హా వీడు నీచేతజ
చ్చెనటంచుం దలపోయుదే మరల లే ♦ చెం నిన్ను దాకంగ మ
ద్ఘన నారాచ పరంపరాహతిని నీ దర్పంబు దూలింతునీ
రణరంగంబును వీడి పోవకు సుమీ ♦ రాజాన్వయగ్రామణీ.

[ఎదుట నున్న కుశునిజూచి]

అన్నయా! కుశా! ఎప్పుడువచ్చితివి?

కుశు—తమ్ముడా! లేచితివా!

లవు—అన్నయ్యా! మన మాతరువాత మాట్లాడుకొనవచ్చును. ముందు మన మీనృపాలుని గెలిచి సవనహాయంబును మరల బంధింపవలయును. (శతృఘ్నునిజూచి) నృపాలా! ఇప్పు డెచ్చటికిబోయెదవు? రణమున మూర్ఛిల్లగా రథముపై బెట్టుకొని పోవుచుంటివా! ఇదియేనా నీపరాక్రమము!

తే. గీ. అన్నదమ్ముల మిరువుర ♦ మాజియందు
నిలిచి నారము రారమ్ము ♦ నిలువు మిపుడు
భవుడె యేతెంచి నీకడ్డు ♦ పడినగాని
భయము నందక నీదు ద ♦ ర్పంబు నార్తు

(శరములు సవరించుకొనుచున్నాడు)

శతృ—(తనలో) వీరిరువురును నశ్వినీకుమారులవలె గన్పట్టుచుం బరాక్రమంబున విజృంభించుచున్నారు, నేనింక గరుణ వహింపరాదు (ప్రకాశముగా)

తే. గీ. బాలహ్మణార్భకులకునేల ♦ భండనంబ
టంచు వచియించితిని గాని ♦ యాజకెపుడు
భయము నందు వాడను గాను ♦ బాలురార
రంకు కోర్కెయుండిన సంగ ♦ రమ్మునేయ.

కుశు—ఇదిగో! మేముసంసిద్ధులమైయుంటిమి

లవు—ఇదిగో! ఈయస్త్రమును గాచుకొనుము. (శరప్రయోగము సేయును.)

శత్రు—ఇదిగో! నీశరంబునుఖండించితిని. (తిసలో) లవణాసురునితో బోరునప్పుడైన ధైర్యమును విడువని నాచిత్త మేటికోగాని వెనుదీయుచున్నది. (ప్రకాశము) బాలకులారా? ఈయస్త్రరాజము మిమ్ముదప్పక నేలఁగూల్చును.

(శరము విడుచును)

కుశు—(అస్త్రమును ఖండించి)

మ॥ వరపాతాళములోని కేగిన, నభో ♦ భాగంబునన్ జొచ్చినన్
శరధిన్ మున్గి యడంగినన్ సుజన ర ♦ క్షోదక్షుడౌ పార్వతీ
వరు డడ్డంబయి నిల్చినన్ వినుము మ ♦ ద్బాణంబు నీప్రాణముల్
ధరణిం గూల్చక యుండునే నిలువుమీ ♦ ధైర్యంబునన్ భూవరా.

(శరప్రయోగము సేయును)

శత్రు—హా! (నేలంబడును.)

లవు—అగ్రజా! మనముతొందరఁగా బోయి యాసేనలను జీకాకు పరచి హయంబును బంధించుకొని పోవుదము రమ్ము.

(నిష్క్రమింతురు.)

రంగము:—[వాల్మీకాశ్రమోపాంతవనము :—కదళీకాతరువునకుఁ గట్టఁబడిన యజ్ఞాశ్వముతో కుశలవులుప్రవేశము.]

లవు—అన్నయ్యా! మనశరంబులచే మూర్ఛనొందిన యాశత్రుఘ్నుని వార్తన్ వినియతనియన్ననని చెప్పుచు లక్ష్మణుండువచ్చి యాతఁడుగూడ దమ్మునిపాటునే బొందెనుగదా! ఇంకెవ్వరు వచ్చెదరో!

కుశు—తమ్ముడా. ఎవ్వరు వచ్చిననేమి;

తే. గీ. మూడుజగములు నేకమై ♦ భూరివిక్రి
మమున వచ్చిన, రానిమ్ము ♦ సమరమందు
భీతి నొక్కింత యుందక ♦ భీకరాస్త్ర
వహ్నిలో వేల్చి విజయంబుఁ ♦ బడయువాఁడ.

తమ్ముఁడా! రమ్ము. మనమాయశ్వమునొద్ద నుందము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

[శ్రీరాముఁడు—భరతుఁడు—ప్రవేశింతురు.]

శ్రీరా— (అనుబంధము 20)

భరతా! లోకకంటకుఁడైన యాలవణాసురుని వధించిన మనశత్రుఘ్నుఁడేమి! ఆ మునికుమారులచే నేలఁగూలుట యేమి! శౌర్యధనుండగు వాని కిట్టిపాటు గలుగునని యెన్నడైనఁ దలంచితినా? ఇది యట్లుండ లక్ష్మణునిస్థితినాకు మఱింతచింతయు నద్భుతంబునుగలుగఁ జేయుచున్నది! అక్కటా! నేనీయశ్వమేధయాగంబు నేలఁ జేయ బ్రారంభించితిని. వీరరత్నములగు నాయిరువుర తమ్ములను గోలుపోవుటకే కాఁబోలు (లక్ష్మణు నుద్దేశించి) హా! సుమిత్రాత్మజా!

సీ. అతికాయ దానవు ♦ నవలీల గెల్చిన
భవదీయశౌర్య మే ♦ పంచకరిగె
కుంభ నికుంభాది ♦ ఘోరాసురుల గూల్చు
విక్రమాటోప మే ♦ పృథ్విఁజొచ్చె
కడుకోపి ధూమ్రాక్షు ♦ కాయంబు బాపిన
మహనీయశక్తి యే ♦ మంటఁగలిసె
మేటివీరుండైన ♦ మేఘనాథుని జంపి,
నట్టిచాతుర్య మెం ♦ దడఁగియుండె

తే. గీ. అక్కటాయింతశక్తి నీ యందు నలరు
చుండినను మఖవాజికై ♦ భండనమున

మునికుమారుల నెదిరించి ♦ పుడమియందుఁ
బ్రాణములఁ బాపితే సుమి ♦ తాత్రికుమార.
సీ. నినుఁ బాయలేనంచు ♦ ఘనసౌఖ్యముల వీడి
వనులకు నావెంట ♦ వచ్చినావు
పదునాల్గువర్షముల్ ♦ బవళింపకే నాకు,
సద్భక్తిసేవలు ♦ సలిపినావు
నాకష్టసుఖములే ♦ నీకష్టసుఖములు
టంచు నెంచుచు జరి ♦ యించినావు
నిరతంబు నాయాజ్ఞ ♦ శిరముపై ధరియించి,
సేవకు కైవడి ♦ చెలగినావు
తే. గీ. కటకటా! నేఁడు నామీఁద ♦ గలితభక్తి
విడిచి యజ్ఞాశ్వమునకునై ♦ పుడమి పడితె
నిన్ను విడనాడియుం కెట్లు ♦ నిలువనేర్తు
తమ్ముఁడా! లక్ష్మణా! సుమి ♦ తాత్రికుమార.
భర—అగ్రజా ! నీకిది యేమివెఱ్ఱి ! విక్రమసంపన్నులగు లక్ష్మణ శత్రుఘ్ను లొకరిచే నేలబడువారా ! వారు మూర్ఛలో మునింగియుండిరి.
శ్రీరా—తమ్ముఁడా ! ఏమిమూర్ఛ ! తమ్ములు సజీవులగుట నేను వీక్షించెదనా ! అట్టిభాగ్యము నాకున్నదా !
చ. సతులు ననేకులుం గలరు ♦ సంపదలెట్టివి యైనవచ్చు సం
గతిని ననేకబంధువులు ♦ గల్గుచునుందురు: పుత్రపుత్రికా
తతియు జనించుచుండును; ర ♦ థంబులు నేస్తులు వచ్చుగాని యీ
క్షితితలమందు సోదరులు ♦ జేకుఱ రెట్లు దలంచిచూడఁగన్.
భర—అగ్రజా! నీవు విచారించవలదు. మన లక్ష్మణశత్రుఘ్నులు త్వరలోనె మూర్ఛనుండి లేవఁగలరు.

శ్రీరా—(కోపములో) తమ్ముడా! మన లక్ష్మణశత్రుఘ్నుల కట్టిపాటు సంభవింపజేసి యజ్ఞాశ్వమును బంధించిన యామునికుమారు లెవ్వరో, వారి వధోద్యోగమునఁ బ్రవర్తించుటకు నాచిత్తము తత్తరమందుచున్నది. ఏమైననుసరే! ఆతాపసకుమారులింకఁ బుడమిపై లేనివారుగనే భావింపవలయును.

భర—అన్నయ్యా! అటుచూడుము. మహాహయంబున నావృక్షము నకుఁగట్టి యిట్లువచ్చుచున్న యాబాలకులే మన సైన్యంబులఁ జీకాకుపఱచి తమ్ములతోఁ గయ్యముజేసినవారని తలంచెదను.

[కుశలవులు—గాలవునితో బ్రవేశము.]

కుశు—(గాలవునిజూచి) గాలవా! నేజెప్పిన సంగతి యంతయు నరసి వచ్చితివా? ఆవచ్చిన మహాసైన్యమున నెవరెవ్వరెట్టి వీరాగ్రణులో గనుగొంటివా!

గాల—కుశకుమారా! అంతయు నెరింగివచ్చితినిగాని, యాసైన్యముఁ జూడఁగా నేలయీనిన చందమున నుండి నాకు మిగుల భయమును గలుగఁజేయుచున్నది. శ్రీరాముడే స్వయముగాఁ దనతమ్ముడగు భరతునితోఁ గయ్యమునకువచ్చినాఁడు.

లవు—గాలవా! మాయిరువురకై యెంతసైన్యము వచ్చినదో చూచితివా!

గాల—మిత్రులారా! జరిగినదానిం దలపక యజ్ఞాశ్వమునువిడిచి మన మాశ్రమమునకు బోవుదము.

కుశు—బ్రాహ్మణుఁడా! భీతిబొందక నీవు తెలిసికొనివచ్చినంతవఱకు నామహాసైన్యములోఁ బ్రముఖులైన వీరులెవ్వరో తెలియజేయుము.

గాల—నేను గనుఁగొని వచ్చినంతవఱకు వినిపించెదను. ఎట్లైనను మనకు సమరముతోఁ బనిలేకుండ హయమునువిడిచిపోవుదము.

లవు—గాలవా! పరికిమాటలువిడిచి యీవీరు లెవ్వరెవ్వరో చెప్పుము.

గాల—మిత్రులారా! ఇటు రండు

సీ. మిడిగ్రుడ్లు దిప్పుచు ♦ భీమరూపంబుల
వెలైడి వానర ♦ వీరులరుగొ
నీలజీమూత స ♦ న్నిభశరీరులు నతి
ధైర్యచిత్తులనైన ♦ దైత్యులరుగొ
కడుగోమవృద్ధిచే ♦ గ్రాలుచు భయము గొ
ల్పెడి మేటి భల్లూక ♦ వీరులరుగొ
పరశువ్రాస గదాది ♦ బాణంబులను దాల్చి
బరగుచుండిన నర ♦ పాలురరుగొ
తే. గీ. కంటి రే నేలయీనిన ♦ కరణినున్న
సేన దీనిఁ జూచినయంత ♦ చిత్తమందు
భయముగలదె యొంతటి ♦ వానికైన
మహితగుణులార సీతాకు ♦ మారులారా.

లవు—ఈకోతులను కొండముచ్చులను జూచిన నెవరికి భయముగలుగును! (పరికించి) గాలవా! అచ్చట సంభాషించుచున్న యీవీరు లెవ్వరో నీవు చెప్పగలవా!

గాల—వారి విషయమై నేనెఱింగివచ్చితిని. చూడుము. ఆముదటనిలుచున్నవాడు సుగ్రీవుడట. వెనుక రామరావణయుద్ధమున సీతఁడద్వితీయపరాక్రమంబున మెలంగిన వానరవీరుఁడఁట. ఆ రెండవవాఁడు హనుమంతుఁడు.

సీ. బాల్యంబునందున ♦ వ్యాకరణాది శా
స్త్రములు సూర్యునికడఁ ♦ జదివినాఁడు
రామకార్యార్థియై ♦ రహిలంక కేగుచో
వారాశి లంఘించి ♦ వఱలినాఁడు

శంక యింతయు లేక ♦ లంకాపురంబెల్ల
చిచ్చులోపలఁ బెట్టి ♦ చెలఁగినాఁడు
నిరతంబు శ్రీరాము ♦ చరణసేవకుఁడౌచు
నతిభక్తిభావముతోడ ♦ నలరినాఁడు
తే. గీ. వాయుదేవుని వరమున ♦ వరలినాఁడు
కపులయందున విఖ్యాతి ♦ గాంచినాఁడు
పేరు హనుమంతుఁడందురు ♦ భీకరాజి
నతనిసాకట కష్టమో ♦ యనఘులార.

కుశు — గాలవా! ఈకోతులను జూచి భయమందకుము వీరినందఱను మన యాశ్రమమునకుముందుఁ గట్టివేసెదను.

గాల — (ఎదుటజూచి) ఆతనిప్రక్కనున్నవాఁడు లోకకంటకుఁడైన రావణుని తమ్ముఁడగు విభీషణుఁడఁట. రావణుని రణరంగమున శ్రీరాముఁడు పుత్రామాత్య భృత్యాది వర్గముతోఁ దునిమి యాతనిని లంకకు రాజుగా జేసినాఁడు (ఇంచుక యూరకుండి) కుశలవులారా! ఇటురండు. (ఆ మహాపురుషుని శ్రీరామునిఁ జూపుచు)

సీ. శతకోటిమార్తాండ ♦ సమశరీరమువాఁడు
కంజాతములబోలు ♦ కనులవాఁడు
వజ్రపంజరనిభ ♦ వక్షస్థలమువాఁడు
మందారకుసుమ దా ♦ మంబువాఁడు
మహనీయ మాణిక్య ♦ మయకిరీటమువాఁడు
కమనీయరత్నకం ♦ కణమువాఁడు
నీలమేఘచ్ఛాయ ♦ నిరసింపఁదగువాఁడు
కరుణాంతరంగంబు ♦ గలుగువాఁడు

తే. గీ. పూర్ణచంద్రునిఁబోలు నె ♦ మ్మోమువాఁడు
భక్తజన రక్షణముఁ జేయుఁ ♦ బరఁగువాఁడు
విల్లు నమ్ములు కరముల ♦ వెలయువాఁడు
రవికులాంబుధిశశియైన ♦ రాముఁడతఁడె.

ఆతని ప్రక్కనున్న వాఁ డతనితమ్ముఁడగు భరతుఁడు.

లవు—(కుశునిఁజూచి) అన్నయ్యా! వాల్మీకిమహాముని మనకుఁ జెప్పిన రామాయణకావ్యమునందుఁ గథానాయకుఁడగు రాముఁ డీతఁడేనా?

కుశు—తమ్ముఁడా! ఇప్పుడు మనకా విచారణ యేల?

గాల—హితులారా! చూచితిరా! సైన్యమెట్లున్నదో! ఎంతమంది వానరులో! ఎంతమంది దైత్యులో!

లవు—

చ. వానరులైననేమి సుర ♦ వర్గమె యైననునేమి ? క్రూరులౌ
దానవులైననేమి నగ ♦ ధైర్యమునన్నతిఁగాంచి మించునా
మానవులైననేమి యను ♦ మానమొకింతయు బూనకుండ యీ
నూనవరాక్రమ క్రమము - నొప్పగఁ జూపుచుఁద్రుంచివైచెదన్

కుశు—

తే. గీ. అమరనాథుఁడుగాని, పు ♦ రారిగాని
యంతకుఁడెగాని పరమేష్ఠి ♦ యైనఁగాని
భయమునొక్కింత బొందక♦బవరమందు
దాకి విజయంబుగాంచెద ♦ దక్షముగను.

తమ్ముఁడా! మనమిచ్చటనుండుటఁజూచి హయము నెవ్వరైన దీసికొని పోవుదురేమో? మనము దానిసమీపమునందే యుందము రమ్ము (నిష్క్రమింతురు.)

శ్రీరా—(భరతునిఁజూచి) తమ్ముఁడా చూచితివా

ఉ. కంతుజయంతులన్ దెగడి ♦ గ్రాలుచునుండిన వీరలీ వన
ప్రాంతమునందుఁ దాపసుల ♦ భంగినుండుటకేమి హేతువో;
స్వాంతమునందు సందియము ♦ జాలఁగదోఁచెను గాకయున్న దు
ర్దాంత పరాక్రమింబిటుఁ ♦ తాపసులందున గల్గియుండునే
వీరివేషములఁజూడ మునికుమారులవలె నున్నారు ముని సుతుల నీ రూపలావణ్యంబులుగాని, పరాక్రమధైర్యసాహసంబులుగాని యుండుట యెందైన గనివినియుంటిమా?

(తెరలో)

ఓహో వానరవీరులారా మునికుమారుల యస్త్రజాలమ్ము కాగలేక పరుగిడెదరేల?

శ్రీరా—ఆహా! ఏమిది! భరతా అటుచూడుము మనమిక్కడ నుండగనే యాయిరువురి మునికుమారులును మన సైన్యమును గవిసి చీకాకుపఱచుచున్నారు, వీరి ధైర్యసాహసము లద్భుతము గలిగించుచున్నవే అదిగో సుగ్రీవుఁడా కుమారులిరువుర దాకుచున్నాడు వారియ్యెడకే యరుదెంచున్నారు, మనమాప్రక్కనుండి వీక్షింతమురమ్ము (ఇరువురును నిష్క్రమింతురు)

(అంత సుగ్రీవుడు-కుశలవులు ప్రవేశము

సుగ్రీ—(కుశలవులంజూచి

ఉ. బాలకులార నేబలుక ♦ వాక్యములన్ విని యింకనైన, నీ
జాలముమాని యేగుఁడు ద ♦ శానన మర్ధనుడైనరామభూ
పాలుడు బంపినట్టి మఖ ♦ వాజినిబట్టఁ ద్రినేత్రుడైననున్
జాలునె. సాహసంబికను ♦ సాగదు సత్యముగా వచించితిన్

లవు—ఓయీ! కోతిగంతుల కిక్కడ నెవ్వరును భీతిల్లువారు లేరు

తే. గీ. పౌరుషంబున బట్టితి ♦ మఖహయంబు
పాలలోచనుఁ డేతెంచె ♦ బవరమందు

నిలిచినను నిల్చుగాక వె ♦ న్నీయమొప్పుము
వేయిమాటలికేల వే ♦ వేగరమ్ము.

సుగ్రీ — మీపాలిటికిఁ దివ్యనేత్రుఁడు రావలయునా? మీరు బాలకులగుటచే నింతవరకుఁ జెప్పితిని, లేకున్న మదీయ గదాదండముచే మీతలలిదివరకే పిండిజేసియుందును. (లవునిజూచి)

చ. నిలువుము ఘోరయుద్ధమున ♦ నీబలమెట్టిదో చూచువాఁడ నన్
దలపడ నెంచినాఁడవు గ ♦ దా! యికసంశయమంద నేల! నే
గెలిచెదమూఁడులోకములఁ ♦ గ్రిందికిద్రొక్కుచు నాగనాథు దో
ర్బలుఁడగు భానుపుత్రుఁడను ♦ ప్రాణమునందు నెఱుంగుమీ ననన్.

కుశ — సరి సరి, నీవు సుగ్రీవుడవా! అట్లయిన నీవిషయము మే మతి తీవ్రముగ విచారింపవలయును.

సుగ్రీ —

చ. అనిమొన నన్నుదాకి, త్రిపు ♦ రారియు గెల్వఁగఁజాలఁ డట్టి చో
వనములలోపలన్ దిరుగు ♦ బ్రాహ్మణపుత్రకులైన మీరలా
సను నిటగెల్చువారలు, వి ♦ నంగడు నచ్చెరువయ్యెఁ గావునన్
జనుఁడిక మీగృహంబునకుఁ ♦ జయ్యన ప్రాణములుండఁగోరినన్.

కుశ — ఆత్మశ్లాఘాపరాయణా?

చ. ధనువులుబూని యాకరణి ♦ దర్పము బెర్చి రణంబులోపలన్
నినువెనదాకి గెల్చుఁగొన ♦ నిల్చినవారము; భీతిలేదు; నీ
ఘనభుజదర్పమంతయును ♦ గన్బడజేయుము గాకయున్న. ని
య్యనిమొనవీడిపొమ్ము శర ♦ ణార్థిగఁ బోత్రితు మునిస్సన్నపక్షపన్

సుగ్రీ — కాసిందు మీకు కాలము సమీపించినది.

(యుద్ధమునకు మొనయుచున్నాఁడు.)

కుశ — ఇదిగో! కుశకీరము నీ ప్రాణములఁ దీయును.

సుగ్రీ—(శరీరము దప్పించుకొని) కాలదండసన్నిభమగు మదీయ గదా దండప్రహారము గాచుకొనుము.

కుశు—(తప్పించుకొని)

చ. ఘనమగు వారుణాస్త్ర మిది ♦ క్రన్నన వీడుచునుంటి నీపయిన్
వనచర ! యెందుబోయెదవు ! వార్ధినిమున్గిన, భూమిజొచ్చినన్
మునికులుడైన రామవర ♦ నాథుని పజ్జనుడాగి యుండినన్
నిను వెనువెంటనే తగిలి ♦ నీయసురుల్ హరియించు మర్కటా !

(అస్త్రమును విడుచును)

సుగ్రీ—హా! (నేలబడును.)

లవు—అన్నయ్యా! రక్షో వానర సైన్యంబులయందు మేటివీరులమని విఱ్ఱవీగుచు మనలను దాకినవారిదర్ప మడగినది.

కుశు—(ఎదుట జూచి) తమ్ముడా ! ఆవచ్చునది యింతకుమున్ను మనకు గాలవుడు చెప్పిన రామునితమ్మునివలె నున్నాడు.

లవు—అవును.

[భరతుడు—ప్రవేశము]

భర—(తనలో) సుందరరూపులగు నీకుమారద్వయంబును జూచిన నాకది యొకవిధమగు ననుమానము ౦దముచున్నది. వీరు వనవాసులగు మునికుమారులేలయగుదురు ? లోకాపవాదకు భీతిల్లి పరమపావనచరిత్రయగు సీతామహాదేవి నిందుచూలాలని తలంపక రామచంద్రుడు వనంబులయందు విడిచెనుగదా ఆసాధ్వీరత్నమున కీసుతులుదయించిరని నేభావించెద. ముఖలక్షణములన్నియు రామచంద్రుని బోలియున్నవి. కాకున్న మునిబాలురేయైనచో లక్ష్మణ శత్రుఘ్నులు వీరిచే రణంబున స్మృతిదప్పిబడియుందురా ! సుగ్రీవాది వానర వీరు లోడుదురా? ఆదిశక్తియు పరంజ్యోతియు నైన సీతామహాదేవి

జనించినవారగుట నిక్కంబుగా కాని నేనిప్పుడీసంగతి రాము నితోఁజెప్పి వీరిని ననుగ్రహింపుమని నుడువరాదు. అమ్మహా త్ముని యాజ్ఞను నేను బాలింపవలయును. నేను వీరిని సమీ పించి శాంతవచనములతో క్రతుతురంగంబును విడువుడని చెప్పెదను (కుశలవులనుసమీపించి)

తే. గీ. రాముబంపున వచ్చిన ♦ క్రతుహయంబు
బట్టి బంధింపనేటికి ♦ బాలులార
బట్టితిరి కాక సేనలఁ ♦ గొట్టనేల
తగునె సాహసంబీరీతి ♦ దాపసులకు

చ. భగతుఁడ నేను రామనర ♦ పాలుని తమ్ముఁడ మిమ్ము జూచినన్
గరుణజనించె నామదిని ♦ గావున యుద్ధము సేయనొల్లని
ద్ధరణిని భూసురోత్తముల ♦ దాకరుయుద్ధమునన్ నృపాలకుల్
బరువడి వీడుఁడీహయము ♦ పార్థివుడెంతయు సంతసించెడున్

శ్రీరాముఁడార్తత్రాణ పరాయణుఁడు జగత్కర్త అవతారపురుషుడు

చ. మగఁటిమివీడి మీామదుల ♦ మానవనాధుని వేడుడయ్య ము
జ్జగముల వేల్పతండగుట ♦ సత్యము దీనశరణ్యమూర్తి మీా
వగలిక సాగిరావు క్రతు ♦ వాజిని వీడుఁడు కోర్కెతీరఁగా
దగిన హయంబులున్ మణులు ♦ దంతిచయంబును మీాకునిచ్చెదన్

శ్రీరాముడనిన సామాన్యమానవుడుగాఁడు. దైత్యకులసంహారము గావించి భూభరంబువాపుట కవతారమందిన విష్ణుమూర్తి

మ. దశదిగ్భాగములన్ బ్రతాపమహిమల్ ♦ దట్టంబుగానిండ స
ద్దశకంఠస్ఫుటకంఠ పంక్తులను ద్రై ♦ త్యశ్రేణి భీతిల్ల ను
గ్రశరాళిన్ రణమందుదున్మి సుమన ♦ స్సశ్రేణి మెచ్చన్ మహా
యశముం గాంచెను నట్టి రాఘవునికు ♦ గ్రీడన్ వెసంగెల్లువే

లవు—రాజేంద్రా! నీవు చెప్పవలసిన మాటలన్నియు జెప్పితివి ఇక మావాక్యముల వినుము

ఉ. ధారుణి వ్రయ్యలైన హిమ ♦ ధాముడు సూర్యుడు ద్రోవదప్పినన్
వారిధులెల్ల నింకినను ♦ బర్వతముల్ చలనంబునందినన్
వీరులమంచు బేర్వడగ ♦ వేడ్కను బట్టిన యశ్వరాజమున్
ధారుణియందు వీడ మిక ♦ తథ్యముగా వచియింతు మోనృపా

కుశు—తే. గీ. బ్రతుకులా! యస్థిరములు సం ♦ పదలు చంచ
లంబు గావున నీనిభా ♦ వంబు నెఱిగి
యశమునే గోరి నిరతంబు ♦ నలరువాడు
పుణ్యలోకంబు బొందును ♦ బుడమిపాల

మేము స్వర్గార్థమే యీయశ్వరాజమును బట్టి యింతసమరం బాచరించితిమి కాదేని మీకు మణిమయభూషణంబులును కరులును హరులును మందిరంబులును నొసంగెద నశ్వమును విడువుడని యేల బలికెదవు. ఇవియన్నియు మాకేల?

సీ. హీరసంయుతమైన ♦ హారావళులు మీకు
బరమిచ్చురుద్రాక్ష ♦ సరులుమాకు
హాటకస్థగిత ది ♦ వ్యాంబరంబులు మీకు
లలితమా నారచే ♦ లములుమాకు
వైభవాస్పదమైన ♦ వరసౌధతతి మీకు
సౌఖ్యమిచ్చెడి పర్ణ ♦ శాలమాకు
బహువిధభోజన ♦ భాగ్యగరిమ మీకు
బహువిధ ఫలహార ♦ వసతిమాకు

తే. గీ. బహుళ గజరథ జనాశ్వ ♦ బలము మీకు
బహుభయాంకప వనమృగ ♦ బలముమాకు

సతత ఘనరాష్ట్రపాలనా ♦ సక్తిమీకు
సతత పరమేశ చింతనా ♦ సక్తిమాకు

లవు—రాజేంద్రా! నీవు శ్రీరాముడు సాక్షాద్విష్ణుస్వరూపుడని చెప్పుటచేత మాకు సమరోత్సాహము మఱింత యధికమగుచున్నది. నా కడసారి వాక్యము వినుము.

మ. వర రామావనిపాలచంద్రుడుపర ♦ బ్రహ్మంబుగానన్ సురా
ద్ధరసంగ్రామతలంబునందు వినుమా ♦ దోశ్శక్తి మైగొల్చినన్
స్థిరమౌకీర్తిలభించుగాక యతఁడే ♦ చెండాడినన్ మమ్ము మో
క్షపదంబొంది సుఖింపఁగల్గుదుము దే ♦ వౌఘంబు శ్లాఘింపఁగన్

కుశు—నిశ్చయము. నిశ్చయము.

భర—(తనలో) ఆహా! ఏమి! ఈ బాలురయొక్క ధైర్యసాహసములు. ఇప్పుడు నేనేమి సేయుదును! (ఆలోచించి) చేయుటకేమున్నది? సమరమే కర్తవ్యము. (కోపముతో)

ఉ. ధారుణిలోన మీరు ఘన ♦ తాపసపుత్రకులౌటమమ్ములన్
ఘోరరణంబునం దిపుడు ♦ గూల్చఁగఁ జేతులు రాక యిట్టులిం
పారఁగఁ జెప్పినాఁడ నిక ♦ నాహవమే యొనరింపఁ గోరిరే
ధీరమనస్కులై నిలుఁడు ♦ దేవత లచ్చెరువంది మెచ్చఁగన్.

కుశు—మే మింతకు మున్నే సంసిద్ధులమైయుంటిమి. నీవేమైన నెవరితోనైనఁ జెప్పికొని రావలసిచో జెప్పిరమ్ము.

భర—ఆ! ఏమంటివి. ఇదిగో శరము! (ప్రయోగించును.)

కుశు—(శరమును దప్పించుకొని)

తే. గీ. గురుని సత్కృప నాపైనఁ ♦ బరగనేని
గురుని నిరతంబు నాత్మలోఁ గొలుతునేని
జనని మునిజనామరనుత ♦ సాధ్వియేని
యస్త్రమా! వేగఁ గూల్చుమీ ♦ యవనిపాలు.

(శరమును విడుచును.)

భర—హా! (నేలబడును.)

(తెర లో)

శా. ఔరౌరా యిది యెంతవింత ఘనజ ♦ న్యక్షోణిలోఁ దమ్ములన్
ధీరోదారుల శౌర్యమూర్తులను నర్థిం గూల్చఁగా జాలినా
రా! రండిక నెందుబోయెదరు శ్రీ ♦ రాముండనన్ జూడుఁడీ
ఘోరాస్త్రంబురబుచ్చి మిమ్ము నిపుడే ♦ గూల్చన్ దలంపూనితిన్

కుశ—(లవుఁజూచి)

చ. తమ్ముని బాటుజూచి. కనుఁ ♦ దమ్ముల కెంపులురాల కోపభా
వమ్మునుబూని యాతి రిపుర ♦ భంజనుఁడై యల రాఘురుద్రచం
దమ్మున వచ్చుచుండె నిటు ♦ ధాత్రివిభుండగు రామమూర్తి; యు
ద్ధమ్మున దాకఁగా మనల ♦ ధైర్యమువీడక యుండు తమ్ముడా.

లవు—

మ. ఎవఁడైనన్ మన కేమి సంగరములో ♦ నిందారిమర శ్రేణితో
భవుఁడే తెంచి యెదిర్చుగాక నుభయంబావంతయున్ బొందనా
జవసత్త్వంబులు నీకునుం దెలియవా ♦ శౌర్యంబుదీపింప, భూ
ధవునిన్ రాముని దాకెదన్. ధరణి ను ♦ ద్యత్కీర్తి నార్జించెదన్

కుశ—తమ్ముడా! ఎవఁడో వానరు డిట్లు వచ్చుచున్నాఁడు.

[హనుమంతుఁడు—ప్రవేశము.]

హను—అహా! ఏమిది! బాలురెంతటి పరాక్రమవంతులైనారు! మహా శౌర్యమూర్తులైన భరత లక్ష్మణ శత్రుఘ్నులమరణంబున నొక్కకోలకు దెచ్చిరే! వీరులగు సుగ్రీవాదులోడిపోయిరి.-(ఎదుటఁజూచి) అదుగో! భరతుని పాటుఁజూచి శ్రీరాముడు ప్రళయరుద్రుని చందంబున వెలుంగుచు నీ తాపసకుమారులను దాకుటకు గాఁబోలు నిట్లు వచ్చుచున్నాడు. ఈతని రూపము మిగుల భయము గలుగఁ జేయుచున్నది.

సీ. భానుపుత్రుని బ్రోవ ♦ వాలిని దునుమాడు
సమయమందైన నీ ♦ శక్తిలేదు
నాగారి బంధింప ♦ వడి చాపమెత్తిన
సమయమందైన నీ ♦ క్రమము లేదు
గంభీరుండైనట్టి ♦ కుంభకర్ణుని గూల్చు
నప్పుడైన యింత ధై ♦ ర్యంబు లేదు
భువనకంటకుఁడైన ♦ పౌలసుదిండుల జేని
దెగ వ్రేయునప్పు డింత ♦ తెగువ లేదు
తే. గీ. నేటి ధైర్యంబు, రూపంబు ♦ నిరుపమాన
సాహసంబును వీక్షింప ♦ జగములెల్ల
భస్మముగ జేయునా యను ♦ భయము దోఁచె
వీరరాఘవరూపంబు ♦ వెఱయుకతన.

నేనిప్పు డీమహాత్ముని సన్నిధికరిగి యీతనిని వారించి, నే నీముని కుమారులతోఁ బోరాటంబునకుఁ గడంగెదఁగాక! (నిష్క్రమించును)

కుశు— తమ్ముఁడా! ఈవానరుఁ డిట్లువచ్చి మరల రామునికడ కరిగి యేదియో చెప్పుచున్నాడు కానిమ్ము. ఒకరినిమిత్తమై మనము వేచియుండనేల? మనమే శ్రీరాముని దగ్గరకు బోవుదము రమ్ము. (ఇంచుక నడచును)

(తెరలో)

చ. నిలుఁడు నిలుండు బాలకులు! ♦ నేనిదె వచ్చుచునుంటిఁ బోవగా
వల దసురాంతకుండనయి ♦ వన్కకు నెక్కిన వాయుచుండు, దో
ర్బల ఘనవిక్రమాఢ్యుఁడగు ♦ భానుకుమారునమాత్యుఁడఁ మహో
జ్వల చరితుండు రామనరు ♦ పాలుని దాసుఁడ నన్ను గెల్వుడీ.

(అను పద్యమును జదువుచు హనుమంతుఁడు ప్రవేశించును.)

లవు— (హనుమంతుని జూచి) ఓహో! నీవు రాలేదనియే మేము

చూచుచుంటిమి. నీవు సుగ్రీవునిమంత్రివా! సరే! మమ్మెదిరించి సుగ్రీవుడేమయ్యెనో చూచితివా? నీవును నట్లే యగుదువు పురమున్నా.

హను—(తనలో) ఆహా! వీరియాకారములు నాకెంతయు నద్భుతము గొలుపుచున్నవి. అదియుంగాక, శ్రీరామచంద్రుని ముఖలక్షణములన్నియు వీరియందగుపడుచున్నవి. లోకాపవాదకు భయమంది రాముని చేవిడువఁబడిన సీతామహాదేవిగర్భమున నీకుమారు లుదయించిరని తలంచుట కావంతయు సందియము లేదు. కాకున్నచో నట్టి బలిక్రమశౌర్యము లెట్లువచ్చును. నిశ్చయముగా వీరిం గెల్చుట కాపురహరుండైనను శక్తుఁడు గాఁడు.

ఉ. బాలుర కిట్టి సాహసము ♦ వచ్చుట వింతగదోచు వీరితో
నాలము సేయఁగాదరమె ♦ యబ్జభవాదులకైన నేఁగాని; యా
భీలత మున్ను దానవుల ♦ వీచముడంచిన యట్లుగాదు; సీ
తాలలనామనోహరుడ ♦ తప్పక దీనినిఁ దీర్పఁగావలెన్

అయినను వీరిని సామవాక్యములచే భయపెట్టి చూచెదగాక? (ప్రకాశముగా) బాలురారా!

సీ. శతయోజనంబైన ♦ జలరాశి నొకగోష్ప
దంబుగ భావించి ♦ దాటినాఁడ
లంకాపురముకాయు ♦ లంకిణీ యను నిశా
చరి దర్పమును నార్చి ♦ వరలినాఁడ
అక్షీణబలుఁడైన ♦ రాక్షసు నక్షయు,
గురుశౌర్యమున నాజిఁ ♦ గూల్చినాఁడ
శంకయింతయు లేక ♦ లంకాపురంబెల్ల
నగ్నిలోపలఁ బెట్టి ♦ యలరినాఁడ

తే. గీ. భీతిఁబూనక రాక్షస విభునితోడ
జేరి రామునిఁగూర్చి భా • షించినాడ
నట్టి నాతోడ మీరేడ • నాజియేడ
చాలుఁజాలును మరలుఁడో • బాలురార!

కుశు—అంతఅు నిట్లే విఱ్ఱవీగి మాశరముల బాలయినారు,

లవు— మర్కటా ! నీపరిగల్భవాక్యములఁ జాలించి శక్తియున్నచో గదనమునకురమ్ము.

హను—ఏమీ ! ఇదిగో ! నాపరితాపముఁజూడుడు. నావాలంబునకు మిమ్ముఁజుట్టి శ్రీరాముని చరణసన్నిధియందు బెట్టెదఁగాక? (వాలమును త్రిప్పుచు సమీపించును.)

కుశు—(లవునిజూచి) తమ్ముడా! ఈమర్కటుఁడు విశేషమహిమగల వాడును, భుజసత్వముగలిగిన వాడును నై యున్నాడు. వీనితో బోరుచుఁ గాలహరణము సేయుటకు నామనంబు సమ్మతింపక యున్నది. కావున, గురువరుండొసంగిన సమ్మోహనరా రామాస్త్రంబున వీనిని బంధించెదఁగాక.

(మోహనాస్త్రమును బ్రయోగించును.)

హను— తనలో) ఆహా! ఏమి యీబాలుని ప్రభావము? అస్త్రప్రయోగంబున నన్ను శౌర్యహీనునిఁగఁ జేసినాడే !

లవు—హనుమంతా! మేమెక్కడికి, బోయిన నక్కడకుఁ బెంపుడు కోతివలెవచ్చుచుండుము. (హనుమంతుని తనప్రక్కకు దీసికొనివచ్చి నిలఁబెట్టును.)

కుశు—(ఎదుటజూచి) తమ్ముడా! అడుగో! శ్రీరాముఁడు స్వయముగ మనతో రణంబొనర్చుటకుఁ గాబోలు వచ్చుచున్నాడు.

వు—రానిమ్ము.

[శ్రీరాముడు—ప్రవేశము]

శ్రీరా—(తనలో)

చ. పడిరి ధరాధినాయకులు ♦ ప్రాణము వాసిరి వానరాగ్రణుల్
పాడిపాడియయ్యె మేల్ రథము ♦ లుఁ జవనాశ్వములుఁ గజంబులుఁ
బడియె నిదేమివింత ముని ♦ నాథకుమారుల కిట్టి సాహసం
బలవడు టెందు నేను గన ♦ నైతిని మానవలోకమందునఁ

(ఎదుటజూచి) అరుగో హనుమంతుని సమ్మోహనాస్త్రముచే బంధించివైచి వారిచ్చట నేయున్నారు. ఆహా ఏమి వీరిరూపంబులు నాచిత్తము నాకర్షించివేయుచున్నది. కోపమును మరపించినవి.

తే. గీ. మారునకు వంకదిద్దు కు ♦ మారవరుల
గాంచి నంతనె నాకును ♦ దాన్మతనూజ
తలపునకువచ్చుచుండె చిత్తంబునందు
గారణంబది యేమియో ♦ కానరాదు

(పరికించి) సందియములేదు వీరు నిశ్చయముగా సీతకుజనించినవారే

చ. అవనిజనావిధంబున వ ♦ నాళికిబంపగ నామె యాత్రఁయా
చు వనములఁ జరించి, ముని ♦ శూరుల యాశ్రమభూమిజొచ్చి, యా
కవలనుగాంచియుండు, (సీతను దలంచుకొని)
జన ♦ కక్షితినాథతనూజ! నిన్నునున్
భువి నపవాదకుఁ భయము ♦ బొంది వనాళికి బంపితిఁ గదా,

(ఇంచుక యూరకుండి) వీరు సీతాపుత్రకులుగానిచో నిట్టి పరాక్రమ మెట్లుగలుగును? సీతమోమునయున్న లక్షణము లన్నియు వీరిమోము నందునఁ గానవచ్చుచున్నవి. (అలోచించి) ఇప్పుడు నేనీసమరరంగంబున విచారించుచు నుంటి నేని వారందరు నునవ్వుదురు. కావున హృదయము ననుండి పొంగిపొరలివచ్చుచున్న చింతనాపుకొని, యీకుమారులకు

సామవాక్యములఁ జెప్పి హయమును గొనిపోవఁ జూచెదను గాక! (కుశలవులను సమీపించి, ప్రకాశముగా) బాలకులారా !

ఉ. కానఁబలోవఁలన్ గసరు ♦ కాయల మెక్కుచునుండు మీర లే
మానిసి కృపారసంబున స ♦ మగ్రతరంబగు శస్త్రవిద్యలన్
గానఁగఁజాలినారు, కనఁ ♦ గా మదికచ్చెరువయ్యె నెంతయున్
మానికుమారులై యిటుల ♦ మమ్మెదిరించుట మీకు ధర్మమే.

మీరు వీరులైన నగుదురుగాక! రాజులమగు మాతో విరోధమేల ? మీతపంబున కియ్యది భంగముకాదా !

చ. సమరపరాక్రమక్రమము ♦ సాహసశౌర్యము మీకునేల ? భూ
రమణుల సొమ్ములయ్యవి; వి ♦ రాజిత శాస్త్రము లభ్యసించు నే
మమునఁ జెలంగఁగావలయు ♦ బ్రహ్మసురపుత్రకులైన మీరు; భూ
రమణుడఁ జెప్పినాడ నను ♦ రామునిఁగాఁగ నెఱుంగఁ గాఁదగున్.

కుశు—(రామునిఁజూచి)

మ. జనపాలోత్తమ! మానిసులన్న నిటు ని ♦ స్సారంబుగాఁ జూతువే
ఘనశౌర్యంబు నృపాలురందుననె ను ♦ గ్రస్ఫూర్తి శోభిల్లునే
గనలేదే జమదగ్ని నందనుని లో ♦ కస్తుత్య శౌర్యంబుతో
మనుజాధీశుల శౌర్యదర్పములనిన్ ♦ మాయింపఁడే భూమిపై

శ్రీరా—మునికుమారులారా ! ప్రశంస వచ్చినది కావునఁ జెప్పక తప్పదయ్యెను దీనివలన నాత్మస్తుతిఁ జేసికొంటినని తలంపవలదు. మీరిప్పుడు నుడివిన పరశురాముడే నాచే నాజియందు భంగపడినాడు.

చ. సమరమునందు నాయెదుట ♦ సాగునె మీబలవిక్రమంబు, లా
యమమునులతోడఁగూడి తిరిపు ♦ రారియు వచ్చిన గెల్వలేడు నన్
గమలదళాక్షులార మిముఁ ♦ గాంచిన నెంతయుఁబ్రీతియయ్యె హ
స్తమున శరంబు నేగతిని ♦ దాల్తును మిమ్ములఁ గూల్పని త్తరిన్

వత్సలారా! మీతో గయ్యాళము సర్చుటకు నాచిత్తము సమ్మతింపక యున్నది. సవనహాయముతో మీ కేమియు బనిలేదు. తాపసులగు మీరు మా హృదయమునఁ గోపాగ్ని జనింపజేయకుడు. మీ మేలును గోరి వచించు నాపలుకుల విని సవనాశ్వమును విడిచి, నా వెంట సాకేతమునకు రండు. అచ్చట యాగంబును జూడవచ్చును. మీకు వలసిన మణిమయభూషణ కనకాంబరాదుల నొసంగెద.

లవు—రామా! రవికుల జలనిధి సోమా!

మ. తగ నీయానతి సేయకన్నను: బ్రతి ♦ స్తంబైన సత్కార్యమీ
జగతిన్ లేదు మఱొండు, కాని విలస ♦ చ్చౌర్యంబుచేఁ గీర్తిగాం
చఁగ బంధించిన యశ్వరాజ మిక నే ♦ ఛందంబునఁ బీడఁగా
నగు; సందేహముమాని నీమదిని ♦ ఘోరాజిఁ మిముఁ గెల్వుమా

కుశు—

ఉ పోరను గోరియే తురగ ♦ ముఁ బడిబట్టితి మిట్టిలీల, నిఁ
ఘోరరణంబునందున న ♦ కుంఠితశౌర్యము తోడ దాఁకి, వి
స్తారయశంబు గాంచెదము; ♦ ధారుణిఁ గూలితిమేని మోక్షల
క్ష్మీరమణిఁ వరించెదము ♦ చిత్తమునందున శంక యేటికిఁ.

రఘునందనా! నీవు సంశయింపఁ బనిలేదు.

తే. గీ. మణిమయంబైన భూషణాం ♦ బరములిడెద
నంచుఁ బలుకనేల, కరుణమా ♦ యందుఁ బూని
వేడెద మొసంగుమీ రణ ♦ భిక్ష మాకు
రమ్యగుణసాంద్ర శ్రీరఘు ♦ రామచంద్ర.

శ్రీరా—(తనలో) ఆహా! అమృత మొలుకు వీరిమాటలు నాకు మఱింత యనురాగ మొనవజేయుచు సంగరముఖమునుండి తప్పించుచున్నవి. (ప్రకాశముగా) బాలకులారా! ఇంత తే

బాల్యమునందే యిట్టిశౌర్యసాహసము లెట్లలవడినవి! మీ తల్లి దండ్రులెవరు! మీ రేగురునియొద్ద నభ్యసించితిరి?

లవు—మహారాజా! మాతోడ నీవేమైన సంబంధము జేయుదువా? మేమెక్కడ విద్యల నభ్యసించిన నేమి: మాతల్లిదండ్రు లెవ రైన నేమి! మాశౌర్యపరాక్రమములు సంగ్రామరంగంబునఁ జూచెదవుగాక!

శ్రీరా—మీరుసంగ్రామ మనుమాటనువదలకయున్నారు, పోనిండు ఈమాటవినుఁడు. మీరిప్పుడు మీతల్లికడకరిగి,

మ. జననీ! రామనృపాల శేఖరుని యు ♦ జ్ఞాశ్వంబు బంధించి, యాతని సైన్యంబు సమస్తమున్ దునుమగా ♦ ధాత్రీశుఁడేవచ్చె; మే మనిలో నాతని దాకవచ్చునె సము ♦ ద్యచ్ఛౌర్య మేపారఁగా నని ప్రశ్నించినదుత్తరంబు గొనుడీ ♦ యాపైన వీక్షించెదన్.

లవు—రాజేంద్రా! రణరంగంబున విజయలక్ష్మి లాలితులముగాకుండ మాతల్లికడ కరిగినచో నామె మాముఖంబుల దిలకించునా! (ఇంచుక యూరకుండి) రామచంద్రా! ఈ యనవసరమైన సంభాషణముతో నేలకాలయాపనము జేసెదవు! నీవెంత చెప్పినను మేము రణరంగమునుండి మరలిపోము

శ్రీరా—(తనలో)ఇంక వీరికి భయముగొల్పి చూడవలయును. (ప్రకాశముగా) బాలురాలా!

మ. అరయన్ బాలకయున్నవారు గద; బా ♦ హాశౌర్యమేపార. సం గరరంగంబున నున్న నన్ను జెనకం ♦ గాఁజాలు నెవ్వాఁడు భీ కరులై లోకము లేచు పాతకుల ర ♦ క్షశ్శ్రేణిఁ దున్మాడి, యి ద్ధరణీభారము బాపినాడ నని చి ♦ త్తంబందు మీ రెంచుడీ

అనేక నక్తంచరుల వధించి మించిన నాకు మీరెంతవారు! బాలకులగుటచే నింతవఱకుఁ జెప్పితిని.

కుశు—నీవు దైత్యాంతకుడవనియు భగవత్స్వరూపుండవనియు మే
మెఱుంగుదుము.

ఉ. నీదగు సత్కథాతతియు ♦ నీమహిమాతిశయంబునెల్ల, స
త్యాక్షరలీలఁ గావ్యముగ ♦ ధారుణియందు రచించి మాకు స
మ్మోదముతోఁ బఠింప ముని ♦ పుంగవుఁడిచ్చెను మాగురుండు నిన్
శ్రీదయితుండవే యనుచుఁ ♦ జిత్తములందున నెంతుమెప్పుడున్

లవు—(శ్రీరాముని జూచి)

సీ. పతిశాపవశమునఁ ♦ బాషాణమైయున్న,
పడఁతి శాపంబును ♦ బాపినావు
అక్షీణకృపఁబూని ♦ పక్షినాథునిఁగాంచి
దివ్యమోక్షంబు నం ♦ దించినావు
శబరి యిచ్చిన పండ్లు ♦ చవిఁజూచి, తృప్తివ
హించి సత్కృపను భావించినావు
జలధిబంధనవేళ ♦ లలితకారుణ్యంబు
నించి యుడుతనులా ♦ లించినావు

తే. గీ. దైత్యవిభుతమ్ముఁడనియైనఁ ♦ దలఁపకుండ
మించుకృప విభీషణుని ర ♦ క్షించినావు
రాజమాత్రుండవే నీవు ♦ రామచంద్ర
హరి వటంచును నిన్ను మే ♦ మరయవలదె.

యుద్ధముఁ జేసిన నీతోడనే చేయవలయు.

శ్రీరా—(తనలో) నాచరిత్రమునొక మునీంద్రుఁడు కావ్యముగకూడ
వ్రాసినాడట. (ప్రకాశముగా) బాలురారా! ఇంక మీరు
నామాటవినరు. కానిండు (శరమును చేఁబూని) బాలకా!

మ. ఖరునిం ఘోరరణంబులో హతునిగా ♦ గావించి మించెన్ మహో
ద్ధుర బాహాబలశాలి వానిని దృటిన్ ♦ దున్మాడె లంకాపురీ
శ్వరుఁడైనట్టి దశాననున్ దునిమి దే ♦ వశ్రేణి రక్షించె నే
వరచాపంబా: యదేసుమీయిదియు మీపై నేఁబ్రయోగించెదన్
(శరముచేబూని)

బాలకులారా ? ఇప్పుడైనను మీరు బాగుగ యోచించుకొనుఁడు. నా
శరము కరమునుండి పడెనేని మీ ప్రాణములు దక్కవు.

కుశు—రామా ? మమ్ము భయపెట్టవలదు.

మ. ధరణీభారనివారణంబునకు దై ♦ త్యశ్రేణి గూల్పంగ, భా
స్కరవంశంబున జన్మమందిన రమా ♦ కాంతుండవౌ నిన్ను సం
గరమందున్ గెలువంగఁగల్గిన దిలో ♦ కఖ్యాతి చేకూరు ! నీ
కరమందున్ దెగినన్ లభించుగద ♦ మోక్షశ్రీసమాశ్లేష మో
వరలక్ష్మీధర సంశయింప కిఁక నీ ♦ బాణంబు సంధింపవే !

లవు—

చ॥ జగములకెల్ల దండ్రివట ♦ సత్యము మాకును దండ్రివౌదువో
నిగమ విచార ! నీలగళ ♦ నీరజసంభవ సన్నుతా ! నినున్
దగ రణమందు దాకి సమ ♦ దగ్రబలంబున గెల్చుగొన్నచో
జగమున కీర్తిగాంతు మది ♦ సాగక నీదు శరాళిచేతనే
దెగిపడినన్ సుఖించెదము ♦ దివ్యపదంబును జేరి రాఘవా?

అంతియేగాని మేము సమరపరాఙ్ముఖులము గాము అట్లొనర్చినచో
వాల్మీకిశిష్యులనియు సీతాసుతులనియు జెప్పుకొందురా ?

శ్రీరా—(ఆశ్చర్యముతో) హా! సీతాపుత్రులా! సీతా!
[మూర్ఛిల్లును]

లవు—అన్నయ్యా! ఈనృపాలుడు మనము యుద్ధము సేయకుండనే మూర్ఛఁ బొందినాడేమి

కుశు—నాకును వింతగ నేయున్నది. కానిమ్ము ఇదియు మంచిదే మనచే బంధింపబడిన యీవానరుని దోడ్కొని యాశ్రమము నకుఁ బోవుదము. అమ్మ మనకై విచారించుచుండును రమ్ము

ఇది పంచమాంకము





శ్రీ

# సంపూర్ణోత్తర రామాయణము.



## షష్ఠాంకము.



రంగము;—వాల్మీకాశ్రమము.

[ప్రవేశము:—విచారముతో సీత (మూర్ఛలోనుండును)[కుశలవులు]

**లవు**—అగ్రజా! మన మా సమరవిధంబంతయుఁ జెప్పినయంతనే అమ్మ యీవిధంబున మూర్ఛనందిన దేమికారణమో కదా?

**కుశు**—నాకును నేమియు దోచకున్నది.

[ అనుబంధము 21 ]

**సీత**—(మూర్ఛనుండిలేచి) హా! ప్రాణేశ్వరా! నీ కెట్టిపాటు సంభవించినది! లోకాపవాదకు భయంబంది నీవు నన్నుఁ బరిత్యజించినను నిరంతరమును నాహృదయపీఠమున నీమూర్తినే బాదుకొలిపి నీసౌఖ్యమే గోరుచు నీయరణ్యంబున దినములఁ బుచ్చుచుంటిని.

ఉ. హా! రఘువంశదీప! విబుధావన! హాచిరపుణ్యలీల! యా
హా! రమణీయగాత్ర! సక ♦ లామరసన్నుత పాదపద్మ! వి
స్తారయశఃప్రకాశ సము ♦ దారగుణాకర! రామచంద్ర! నీ
వా రణమందు నాసుతుల ♦ న్నైతివె ప్రత్యర్థులచే, మనోహరా!

ఇంక నా జన్మమేల!

సీ. రాష్ట్రాపరాధు వి ♦ రాధుని నానాడు
నాకునై గాదె దు ♦ న్మాడినావు
భానుజు జేపట్టి ♦ నానిమిత్తము కాదె
వాలిదర్పము భంగ ♦ పఱచినావు
మతిమంతుఁడౌ హను ♦ మంతు నాకై కాదె
మించి లంకకును బం ♦ పించినావు
శంకయింతయు లేక ♦ జలరాశిపైన నా
కై కాదె సేతువుగట్టినావు

తే. గీ. నాకొఱకుఁగాదె వీరవా ♦ నరులగూడి
లంక కరుదెంచి దైత్యుల ♦ బింకమార్చి
దశశిరస్కుని దున్మాడి ♦ తనరినావు
రఘుకులాంభోధిచంద్ర శ్రీరామచంద్ర!

అట్టి నీవు నేడిట్టయితివా! హా! నాథా! నీదివ్యమంగళ విగ్రహసందర్శనమునకు, నీపాదసేవకును నేను దూరంబయినను నిరంతరమును నీనామస్మరణమే సేయుచుఁ గాలము గడుపుచుండ నీవిట్లయితివా? అయ్యో! ప్రాణేశ్వరా! ఇంక నాకేమిగతి?

కుశు—(సీతనుజూచి) తల్లీ! నీవీరీతి శోకించెదవేల? మాకేమియు తోచకున్నది!

సీత—కుమారులారా! ఏమిచెప్పుదును? మీరెంత సాహసకార్యమును జేసినారు!

చ. జనకుఁడు మీకు భానుకుల ♦ సాగరచంద్రుఁడు రామచంద్రుఁడౌ
తని నిటుఁ జేసినారుకద ♦ ధర్మముదప్పి; కుమారులెందునన్
జనకుల కిగ్గుసేయుదురె ♦ సాహసమొప్పను మీకెగాక? నా
తను వెటునిల్చునింక గుణ ♦ ధాముని రాముని జూడకుండినన్

కుశు— ఏమీ శ్రీరామచంద్రుడు మాజనకుడా ! ఈసంగతి మాకె న్నడును దెలుపవైతివే !

లవు—అమ్మా! నిన్నెన్నిసారులు మేము మాతండ్రియెచ్చటనుండెను? అతని పేరేమి యని యడుగ, నెన్నఁడును జెప్పవైతివే !

సీత—సాక్షాద్భగవంతుడగు నాశ్రీరాముడే మీతండ్రి మీచే గెలిచిన భరత లక్ష్మణ శత్రుఘ్నులు మీపినతండ్రులు.

లవు—(విచారముతో) హా! మేమెంత దారుణకార్యమాచరించితిమి !

చ. జనకుఁడు సేయు యజ్ఞమని ♦ స్వాంతమునం దలపోయకుండ, నా
తనిమఖవాజిబట్టి, పిన ♦ తండ్రుల ముచ్వుర బుణ్యమూర్తులన్
ఘనరణమందు గెల్చి, తిరిగ ♦ గంబులలోఁ బితృహంతలంచు మ
మ్మనుకొనగా నొనర్చితిమి ♦ హా! యిక నేక్రియ నుందుమమ్మరో!

కుశు—అమ్మా! శ్రీరాముడు మాతండ్రియని యెన్నడును జెప్పియుం డవైతివికదా ! మాకాసంగతి దెలిసియున్నచో నింత సాహస కార్యంబొనరించి, పాపము గట్టుకొందుమా! ఇట్టి పాపకార్యం బొనరించి మేమింక ధాత్రిపై బ్రతుకజాలము. రణరంగంబున మూర్ఛనొందియున్న మాతండ్రి చరణసన్నిధికరిగి, యచ్చ టనే ప్రాణములఁ బాసెదము.

సీత—ఎంతకష్టమెంతకష్టము ! పుత్రులారా ! జనకుని దివ్యమంగళ విగ్రహముఁ జూచినప్పుడైన మీకు రణోత్సాహము తగ్గలేదా అమ్మహాత్మునిపై మీకేల శరంబుల బఱపితిరి ?

లవు—అమ్మా ! మేమాతనితో యుద్ధమే సేయలేదు. రణముఖమున మేమతి భక్తివినయములతో సంభాషించినాము. మాటలాడు చునే యాతఁడు మూర్ఛనందినాఁడు. నీవుమామాటలనమ్మవేని మేము తోడ్కొనివచ్చిన హనుమంతుఁడను వానరు నడిగి తెలిసికొనుము.

సీత—హనుమంతుడా ? ఎచటనున్నాఁడు !

కుశు—రణమున మేమాతనిని సమ్మోహనాస్త్రంబున బంధించి, తీసి కొనివచ్చి యాశ్రమమునందు గట్టివైచినాము.

సీత—హనుమంతుఁడే మీచేత బంధింపబడినాఁడా ! (తనలో) వీరి చర్యలన్నియు మిగుల నద్భుతంబును గలుగఁజేయుచున్నవి. (ప్రకాశముగా) కుమారులారా ! ఎంతపని జేసితిరి? హనుమంతుని బంధించితిరా ? చాలుఁజాలు. శీఘ్రముగా నాతనిని బంధవిముక్తుని జేసి, తోడ్కొనిరండు.

లవు—(నిష్క్రమించి) వెంటనే హనుమంతునితోఁ బ్రవేశించును.

హనుమంతుడు—(ప్రవేశించి) (అనుబంధము 22) తల్లీ ! వందనములు

సీత—హనుమంతా ! సమస్తకార్య నిర్వాహకుఁడవగు నీవుండియుఁ గూడ నింతకార్యముఁ జేయించితివా ?

సీ. పరమహర్షముతోడ ♦ భానుజ విభునకు
హితునిగాఁ గావించి ♦ యొసగినావు
వారాశిఁ దరియించి ♦ ప్రాణేశు క్షేమంబు
దెలిపి నాప్రాణముల్ ♦ నిలిపినావు
రణరంగమందు మూ ♦ ర్ఛమునింగిన సుమిత్ర
పట్టిని రక్షించి ♦ బరగినావు
రాముపై నొక్క శ ♦ రంబైనఁ బడకుండ,
నాజిలో నతనిముం ♦ దలరినావు

తే. గీ. మించుభక్తిని రాముమె ♦ ప్పించి యతని
భూరికృపకు బాత్రుండవై ♦ బొలిచినావు
నీప్రభావంబువర్ణింప ♦ నేరితరము ?
శౌర్యగుణసాంద్ర! హనుమంత ♦, సచ్చరిత్ర.

వాయునందనా! నీవుండియుఁ గుమారుల బాల్యచాపల్యము నుడుపలేక

పోయితివా? రణరంగంబున నట్లు ప్రాణేశ్వరుడు పడియుండెనని విని యింక నేనెట్లు బ్రతుకుదును ?

హను—తల్లీ! శ్రీరామచంద్రునకుఁ దెలియని విషయ మొక్కటియు లేదు. ఆతఁడు సమస్తమును గ్రహించియే బాలకులతో పోరాడకుండ యోగనిద్రను బొందినాడని తలంచెదను. అతడు, త్వరలోనే లేచినందున కానందము గలుగ జేయును

తే. గీ. ఆదిశక్తివి నీవు మా ♦ యమ్మ నీకు
జననమందిన సుతు లతి ♦ శౌర్యధనులు
సమరమున వీరి గెల్వంగఁ ♦ జాలడమ్మ
మూడు కన్నుల వేల్పైన ♦ భూమిజాత

లవు—అమ్మా! తాత వచ్చుచున్నాఁడు

వాల్మీ—(ప్రవేశించి) అవురా! ఎంతలో నెంతయ్యె!

(అనుబంధము 23)

సీత—(వాల్మీకిపాదములపైఁబడి) మహాత్మా! మునీంద్రా! ఇంక మాకేమి తెరువుఁ జూపెదవు? నీవు లేనిసమయమునఁ గుమారులు ప్రాణేశ్వరుని యజ్ఞహయంబు బట్టి సైన్యములఁ జీకాకుపఱచి మఱదులగు భరత లక్ష్మణ శత్రుఘ్నులను రణంబున గూల్చినారట. భగవత్స్వరూపుండగు మన్నాథుండు గూడ మూర్ఛబొందియున్నాడఁట.

కుశు—(వాల్మీకి పాదములపైబడి)

తే. గీ. జనకుక్రతువాజి బంధించి ♦ సాహసమున
పిన్నతండ్రుల గూల్చిన ♦ వీరులనుచు
జగములో నింద లేకుండ ♦ సరణి నరసి
మమ్ము రక్షింపుమా నీవు ♦ మౌని చంద్ర

(అనుబంధము 24.)

లవు—

తే. గీ. బాల్యచాపలంబున గ్రితు ♦ వాజిబట్టి
సాహసంబొనర్చితి మట్లు ♦ సంయమీంద్ర!
పిన్నతండ్రులు, దండ్రియు ♦ బృథ్విపైన
బ్రతుకు మార్గంబు నరయుమీ ♦ మహితకృపను

వాల్మీ—(సీతనుజూచి) సాధ్వీమణీ! నీవు చింతింపవలదు (కుశలవులం జూచి) కుమారులారా! వగవకుఁడు నేను వరుణలోకమున కరిగియుండుటచే నిట్లు సంభవించినది. ఇదియుఁతయు నేను దివ్యదృష్టినిఁ గనిపెట్టి వచ్చితిని మదీయతపః ప్రభావంబున రణరంగంబునఁ గూలినవారెల్ల జీవించిరి యోగనిద్రావశుండైన శ్రీరామభద్రుండును గూడ లేచినాఁడు

మ. జనకక్ష్మాధవపుత్రి! నీదుమదిలో ♦ సంతాపముఁ బీడు మిం
కనిముఁ రాముఁడు గ్రహించుజుమీ ని ♦ క్కంబొప్పగా నేఁపునా
జననంబుఁ సఫలత్వముఁ గనియె నీ ♦ సత్పుత్రకులీ శిష్యులై
మనుటఁ ధాత్రిని నింతకన్నను గడుఁ ♦ భాగ్యంబు వేరున్నదే.

తల్లీ! నేపటితో నీయిక్కట్లన్నియు గట్టెక్కు. అఖిలజనసభామధ్యంబున రేపు శ్రీరామచంద్రుఁడు నీచేత శపథముఁ జేయించి నిన్ను గ్రహించును. నేనందులకు సమ్మతించితిని

కుశు—గురువర్యా! మాజనకుని జూచుటకు మాచిత్తములు తత్తరమందుచున్నవి.

(అనుబంధము 25.)

వాల్మీ—కుమారులారా! రేపు మనము సాకేతపురమున కరుగుదము రామాయణకావ్యమును మీరచ్చట నిండుసభయందు మీ తండ్రియగు రామునకు వినిపింప వలయును.

హను.—(తనలో) శ్రీరామచంద్రుడు మరల నీదేవిచే నేల శపథము జేయింపఁ దలంచెనో కదా !

వాల్మీ—(హనుమంతునిజూచి) రామసేవాపరాయణా ! పావనీ ! మన మందరమును గలిసియే సాకేతమున కేగుదము.

హను—మహాభాగ్యము !

వాల్మీ—(సీతను కుశలవులనుజూచి) అమ్మా ! రమ్ము. కుమారులారా రండు ! మారుతీ ! రమ్ము.

(అందఱును నిష్క్రమింతురు.)

---

రంగము—సాకేత పురప్రాంతమున యాగశాల.

(శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు - హనుమంతుఁడు అనేకమంది రాజులు - మునులు - ప్రవేశము.)

శ్రీరా— (లక్ష్మణునిఁజూచి) తమ్ముఁడా ! ఆవాల్మీకి నాచరిత్రమునే కావ్యముగ వ్రాయుట కేల యవసరము వచ్చెనోకదా !

లక్ష్మ—సాక్షాదిందిరానాథుండవు నీచరిత్రము వ్రాయుట యాతని భాగ్యవిశేషమే కదా !

భర—అందలి పదగుంభన, మర్థచమత్కారము వర్ణనాతీతము.

శత్రు—కుమారులగు కుశలవుల గానము కావ్యమునకు మఱింత వన్నె దెచ్చినదని నుడువదగును.

శ్రీరా—(లక్ష్మణునిజూచి) తమ్ముఁడా ! లక్ష్మణా ! నేను సీతశపథము సేయునని సభ్యులందఱును వేచియున్నారు. ఋషిపుంగవుం డగు వాల్మీకి జానకి నింకను గొనిరాఁడేమి !

శత్రు—(ఎదుటజూచి) అదుగో ! అనుకొన్నంతలోనే కుశలవకుమార సమేతయగు సీతామహాదేవితో గూడ నమ్మహాత్ముం డరు దెంచుచున్నాఁడు.

(వాల్మీకి-సీత-కుశలవులు-ప్రవేశము)

అందఱు—(వాల్మీకి నమస్కరింతురు.)

శ్రీరా—(వాల్మీకినిఁజూచి)

సీ. నడుకానఁ జిక్కిన ♦ పుడమిపుత్రినిఁగాంచి
మించు సత్కృప నాద ♦ రించినావు
నాదు నందనులకు ♦ మోదంబుమీఱంగ
సకలవిద్యల నేర్పఁ ♦ జాలినావు
నాచరిత్రం బుల ♦ నాచంద్రతారకం
బై యుండ గావ్యంబు ♦ వ్రాసినావు
బవరమందున మున్న ♦ ప్రాణముల్ విడిచిన
వారినిబ్రదికించి ♦ వరలినావు
తే. గీ. మునికులోత్తమ భవదీయ ♦ ఋణముదీర్ప
వశము యెన్ని జన్మములకైన ♦ భక్తితోడ
నర్పణము సేయు వందనం ♦ బందుకొనుము
ధన్యగుణసాంద్ర వాల్మీకి ♦ తాపసేంద్ర.

(వాల్మీకికి నమస్కరించును)

సీత....(శ్రీరామునిఁజూచి)

సీ. అడవి కంపినగాని ♦ యాశ్రమంబున నిన్నె
సేవించు చుంటిని ♦ శ్రీగుణాఢ్య!
ఎంతచూచినను నా ♦ కేనాఁడు [illegible] చక
యండనితఁడు ప్రోచె ♦ నుర్విజేడ!
అతిశౌర్యధనులౌచు ♦ నలరు నీకొమరుల
నరసి రక్షింపుమా ♦ శ్యామలాంగ!
కన్నడ యిక మాని ♦ కరుణ మీఱఁగ నాకు
నీసేవ నొసగుమా ♦ నీరజాక్ష!

తే. గీ. చేయుమన్నట్టి శపథంబు ♦ సేయుదాన
బాగు బాగని నన్నెచ్చు ♦ భవ్యజనులు
సందియంబును బొందక ♦ డెందమందు
భవ్యగుణసాంద్రి రామభూ ♦ పాలచంద్రి.

ప్రాణేశ్వరా! ఇన్నాళ్ళకు నామీఁద నీకుఁ గరుణవచ్చినది. నేనెంతయు ధన్యురాలను.

చ. జనకుని యశ్వరాజమని ♦ స్వాంతమునందు నొకింత యెంచకే
ఘనమగు సాహసంబునను ♦ గట్టిచలంబును బూని యట్టులన్
రణ మొనరించినామని మ ♦ నంబున గిన్క వహింపకుండనీ
తనయులమైన మమ్ముఁగను ♦ధన్యుల జేయఁగదయ్య మ్రొక్కెదన్.

కుశు— తే. గీ. ఆదినారాయణుండవై ♦ యలరు నీకు
సుతులమై యుంట మాపూర్వ ♦ సుకృతము సుమ
మాయొనర్చిన దోషముల్ ♦ మదిని మఱచి
మమ్ము రక్షింపుమా యింక ♦ మహిత కృపను.

చ. జనకజ మాకుఁ దల్లియగు ♦ సద్గుణపేటిఁ నిరంతరంబు నె
మ్మనమున నీదుపాదముల ♦ మానక గొల్చెడి సాధ్వి యిన్నఁ మ
మ్మును గనిదైన నీమె నిఁక ♦ భూరికృపారస ముప్పతిల్లగా
గనుగొని నీదుదివ్యపద ♦ కంజములన్ శిరముంచి మ్రొక్కెదన్.

(రామునకు మ్రొక్కెను.)

[అనుబంధము 26.]

వాల్మీ—(శ్రీరామునిఁజూచి) రామా! దిననాథకులాభరణా! ఈజనక పుత్రి పాతివ్రత్యమును గూర్చి నీవెఱింగియు డీయు జనులందకు క్షితిల్లి గర్భిణియనియైనఁ దలంపక కానలంబులకుఁ బంపితివి.

ఈమె నాచే మదీయాశ్రమంబునకుఁ గొనిపోఁబడి మునికన్యకారక్షితయై యీకుశలవులఁ గాంచెను. సీత ధర్మచరిత్రయు సుస్వభావయు, సాధ్వీమణియునై యున్నది. ఈమెను గ్రహింపుము. బుధజనసన్నుతుఁడైన ప్రచేతసుని పుత్రుఁడనై యధిక తపోనిష్ఠాగరిష్ఠుఁడనై యొప్పు నేనసత్యమాడను ఈమె మనోవచఃక్రియల నీచరణసేవఁదప్ప నన్యమెఱుంగదు. సీతకొఱకు నేను బొంకితినేని, యెండవానలకోర్చి పెద్దకాలము నేనొనర్చిన తపము నిష్ఫలమైపోవుఁగాక! ఇంకను నీకు సంశయంబున్నచో నీకోరిక ననుసరించి యీసీత సభ్యులందరును వినుచుండ శపథంబుఁ జేయును.

శ్రీరా.—(వాల్మీకిఁ నిజూచి)

సీ. ఆగ్రహింపక నన్ను ♦ నతిభక్తినే జెప్పు
మాట నాలింపుమో ♦ మౌనిచంద్ర
లంకయందున మున్ను ♦ శంకయింతయు లేక
యగ్ని దేవుడె చెప్పె ♦ నవనిపుత్రి
కైన నెఱదు లీ ♦ రేడులోకముల లే
రంచుః నిజంబీమె ♦ యమలచరిత
యనుటకు సందియం ♦ బావంతయును లేదు
ప్రజలాడునిందకు ♦ భయము నంది

తే. గీ. వనములకు బంపితిని: కాన ♦ బ్రజల మదికి
నీదు పల్కులకన్న ఈ ♦ నీరజాక్షి
చేయు శపథంబె హాఢ్యమై ♦ చెలగునయ్య
ధన్యగుణసాంద్ర వాల్మీకి ♦ తాపసేంద్ర.

వాల్మీ—(సీతంజూచి) సాధ్వీమణీ! జనకపుత్రీ! ఇంకనీవు శపథ మొనర్చి నీనాధునకు సంతసము గలుగఁజేయుము.

లక్ష్మ—(తనలో) అగ్రజుఁడు మరల నేదియో శపథముసుచున్నాఁడు. దీనివలన నేమగునో తెలియకున్నది.

సీత—(రాముని విలోకించి) ప్రాణేశ్వరా!

తే. గీ. అగ్ని దేవుడు వచ్చి యీ ♦ యతివసాధ్వి
యంచుపచియింప వినుచు నా ♦ హ్లాద మంది
తుదకు మరల నీగతిని శ ♦ పథ మొనర్చి
ప్రజల సంశయంబును బాప ♦ వలయుననుచు
నాజ్ఞనిడుట నాపూర్వపు ♦ ణ్యంబె సుమ్మ

నీయాజ్ఞననుసరించి శపథ మొనర్చుటకు సంశయించు దాననుగాను. ఇదిగో నేను శపథము సేయుచున్నాను. (కరంబులు మోడ్చి భూమిక్రై చూచుచు)

సీ. పరుఁడైన శ్రీరాము ♦ చరణపద్మంబుల
లలితభక్తిని నెప్డు ♦ గొలుతునేని
పతియిచ్చు నాజ్ఞయే ♦ గతినాల మాటగా
స్వాంతమందున నెంచి ♦ వరలు దేని
రామనామంబు హృ ♦ ద్రాజీవమున నిల్చి
నిష్కళంక నగుచు ♦ నెగడు దేని
శ్రీరామచంద్రునే ♦ చిత్తమందున నెప్డు
దేవదేవునిగఁ జిం ♦ తింతునేని

తే. గీ. ప్రాణనాథుని ఘననామ ♦ భజనదప్ప
నితర సౌఖ్యంబుగోరక ♦ యొసఁగుదేని
నన్ను నీలోనఁ జేర్చుకో ♦ సంగదమ్మ.
పూర్ణకృపఁబూని నాయందు ♦ భూమిదేవి!

(పెద్దధ్వని వినిపించి భూమి బ్రద్దలగును. సీత భూమిలోనికి పోవును సభ్యులెల్లరును నాశ్చర్యముతో జూతురు)

శ్రీరా—హా ! సీతా ! పూతచరిత్రా !

కుశు } హా ! తల్లీ !
లవు }

లక్ష్మ—హా! తల్లీ! జనకపుత్రీ! ఇంకనిన్ను మేము చూడముకాబోలు

భర—హా ! ఎంతకష్ట మెంతకష్టము ।

శత్రు—హా! పాడులోకంబున నుండుట కిచ్చలేక భూమిం బ్రవేశిం
చితివా !

శ్రీరా—(తనలో) విచారముతో)

చ॥ జనములు పల్కుమాటలకు ♦ జాల భయంబునుబొంది నిన్ను, న
వ్వనముల కంపి తండులకు ♦ భావమునందున శాంతమూని; యీ
జనములు చూచుచుండ నిటు ♦ సాహసమేర్పడ రచ్చబెట్టి నం
చు నలిగి నన్ను వీడి భువిఁ ♦ జొచ్చితివే కృపలేక జానకీ !

(అనుబంధము 27.)

హా! జానకీ! నాయెడల నేరములెంచుట నీకు ధర్మమా ! అరణ్యము లందు దురంత సంతాపము నొందుచున్న నిన్నెల్లయిన గ్రహించుటకే శపథమును నెపమును గల్గించితిని గాన నీవొల్లనరింతువని కలనైన దలంపనైతిని. నీచిత్తము నే నెఱింగియుంటినేని యిట్లొనర్చి యుందునా? నేను నీకు బాధలు గల్పించితి నని మోహాలతను ద్రెంచివేసి మాయమై పోతివికదా ! నాయెడల నెంత కృపారహితవైతివి! నీవెక్కడనుంటివని వెదకింపుదు! శివునివిల్లు విఱచుటయు, సుగ్రీవునితో సఖ్యంబు పాటించుటయు వాలిని నిర్జించుటయు సారక్షోభంబు సేయుటయు, దశకంఠుని పుత్రామాత్యభృత్యాదివర్గముతో గూలనేయుటయు, నీనిమిత్తమేకదా? ఒకవేళనాయందొకటి రెండు తప్పులుండిన నుండుఁగాక ! అంతమాత్రమునను గోపించి నన్ను విడుచుట తగునా! నీయనురాగము, నీభక్తి, నీ గుణముల నాకు మఱపునకురావు.

కుశు—(సీతనుద్దేశించి)

చ. జనకునితోడ యుద్ధమటు ♦ సాహసలీల నొనర్చినట్టి యీ
తనయుల కొద్దనుండు టది ♦ ధర్మముగాదని యెంచి యేగితే

లవు—

జననిరో నిన్నువీడి యిక ♦ భ్రాతలమందున నేవిధంబునన్
మనఁగలవారమమ్మ యిటు ♦ మాయెడ నిర్దయఁ బూన నేటికిన్

(అనుబంధము. 28)

శ్రీరా—(కోపముతో) సభ్యులారా! ఈచిత్రమును మీరు చూచితి
రికదా! జానికి వేడుకొనినంతనే భూదేవి యామెకుఁ దెరువిచ్చి
తనలోనికిఁ గొనిపోయెను. ఇంక నేనిప్పుడు తాల్మివహింపరాదు

మ. జలధిన్ బంధనఁ జేసి వానరమహా ♦ సైన్యంబుతోఁ గూడ; ను
జ్వలశౌర్యంబున లంకఁ జొచ్చి యనిలోఁ ♦ జక్కాడి దైత్యేంద్రు; నీ
తలిరుంబోఁడిని దెచ్చినాడనుగదా ♦ దర్పంబుతో; నిప్డు భూ
తలమున్ వ్రచ్చెదఁ దెచ్చెదన్ సతిని సం ♦ తాపంబు నాకేటికిన్

ఈభూమిదేవి నాకాగ్రహముగలుగకపూర్వము సీతనుదెచ్చియిచ్చిన
సరే లేకున్న భువనక్షోభంబుఁ గావించెదగాక!

(బాణమును బూనును)

(ఆకసమున)

ప్రభూ! నీవు సామాన్యమానవుని చందమున నిట్లు క్రోధము దాల్చుట
ధర్మము కాదు నీవు శ్రీమన్నారాయణుండవు భూదేవి యొనర్చిన
యపరాధమేమియును లేదు, నిత్యానపాయినియగు సీత నిన్నెడ బాయ
లేదు ఇందిరాదేవియే భూమియందు సీతయైజనించి శ్రీమన్నారాయ
ణుండవైన నిన్ను బొంది యిప్పుడు తన స్వస్థానము జేరి నీయాగమ
నంబు గోరుచున్నది ఏకాంతమున పాదపద్మములను సమస్త దేవతలను

నిరంతరము నా హృదయపీఠంబున భామగా నిల్పి సేవించుచుందునో; ఏ నారీశిరోమణిని సేవించినంతనే మద్విజాతుల దారిద్ర్యము వాయునో, యా లక్ష్మీదేవి సీతయై నాన్నాళ్ళు నిన్ను భజించినది నీవామెంగూర్చి వెత జెందవలదు ఆమెయుందున్న ప్రేమయంతయు నీకుమారులయిన కుశ లవులపై నిలుపుము.

వాల్మీ—(శ్రీరాముని జూచి) రామా! వింటివి కదా! మింట నిలిచి చతుర్ముఖుం డెట్లు పలికెనో

తే. గీ. మహిత విద్యానముద్రల ♦ మాన్యగుణుల
నీ కుమారుల వీక్షించి ♦ ప్రాకటముగ
మానినీమణిపై ప్రేమ ♦ మఱచిపొమ్ము
రామ జితకామ! జగదభి ♦ రామనామ!

ఇంక నన్యచింతలను విడిచి యాగము సమాప్తి జేయుము,

శ్రీరా—మునీంద్రా! యాగము రేపటితోడనే పూర్తియగును కావున నీవు నాయందు గృపాంతరంగుడవై యాగసమాప్తి వఱకు నుండుము.

వాల్మీ—అట్లనే కానిమ్ము.

శ్రీరా—(కుమారులనుజూచి) పుత్రులారా! రండు. (ఎదుటజూచి) ఇంక నేను యాగకార్యమునందు వర్తింపవలయును.

(తెర వాలును.)

ఇది షష్ఠాంకము



శ్రీ

# సంపూర్ణోత్తర రామాయణము



## సప్తమాంకము.

రంగము:— అయోధ్య — శ్రీరామునిమందిరము.

[ద్వారమునందు లక్ష్మణుఁడు - ప్రవేశము.]

లక్ష్మ — (తనలో) అగ్రజుండగు శ్రీరాముఁడిప్పుడు లోపలకరిగిన మునీంద్రునితో రహస్యముగ సంభాషింపవలయుననియు, వారిరువురును సంభాషించుసమయమున నెవ్వరరుదెంచినను, వారిశిరము ఖండింపబడుననియుఁ జెప్పినాఁడు. కావున నేనతిజాగరూకతతో నుండవలయును. (ఇంచుకయూరకుండి) ఇప్పుడువచ్చిన మునీంద్రుని మున్ను నేనెప్పుడును వీక్షించి యుండలేదు. ఈతఁడెవరో మహాముని శేఖరునివలెఁ గన్పట్టుచున్నాఁడు. (ఎదుట జూచి) అదిగో! ఎవరో మునీంద్రుఁడు వచ్చుచున్నాఁడుఁ. (పరికించి) ఓహో! ఈతఁడీసమయమునందే యేల వచ్చుచుండెనో కదా!

[దుర్వాసుఁడు — ప్రవేశము]

లక్ష్మ — (దూర్వాసునిఁగాంచి) మునీంద్రా! రామానుజుండగు లక్ష్మణుండిదే నమస్కరించుచున్నాఁడు.

దుర్వా—లక్ష్మణుడా! (ఇంచుకయూరకుండి] సౌమిత్రీ! నీవు సత్వరముగ శ్రీరామునకు నారాకఁ దెలుపుము.

లక్ష్మ—మునీంద్రా! శ్రీరాముండొకమునీంద్రునితో నేదిరౌరాహస్య సంభాషణ గావించుచున్నాడు. లోనికెవ్వరును రావలదని యాజ్ఞనిచ్చినాఁడు. వారిసంభాషణము త్వరలోనే పూర్తికాయగును. అంతవఱకును నాయందుఁ గృపఁబూని యిచ్చట విశ్రమించియుండుము.

దుర్వా—శ్రీరాముడెట్టివారితో నేవిధమయిన సంభాషణము జేయుచున్నను నారాకకు నభ్యంతరము గలిగింపఁడు. నే నతివేగముగ నాతనిఁ జూడవలయును పోయిరమ్ము.

లక్ష్మ—మునీంద్రా! నావాక్యంబులఁ జిత్తగింపుము. మునివరుండును నాతఁడును సంభాషించు నవసరంబున నెవ్వరును రాఁగూడదని కఠినమగు నాజ్ఞ నొసంగినాఁడు. ఆతనియాజ్ఞను మీరి పతికించుటకు నాచిత్తము సమ్మతింపదు. మహానుభావా! నాపైఁ గినియక యిచ్చట [illegible] యుండుము.

దుర్వా—ఏమీ! నీవు నామాటవిని శ్రీరామునితో నారాకఁ దెలుపవా? త్రిమూర్తుల నైనను భయకంపితచిత్తులుగాఁ జేయఁగల తపోమహిమచే వెలుగొందు నన్నే వారింపుచుంటివిగా

లక్ష్మ—మహాత్మా క్షమింపుము. నే నిన్ను వారించుటలేదు. శ్రీరాముడును నామునియు సంభాషించువరకును నేను రామాజ్ఞను మౌళిపైదాల్చి ద్వారపాలకత్వము వహించితిని. సేవకధర్మము విద్యుక్తముగ నెరవేర్పవలయునుగదా!

దుర్వా—నీవు నాకు ధర్మబోధ సేయుచుంటివా (ఇంచుకయూరకుండి) స్వేచ్ఛావిహారుడ నగు నాకు నీతో నేమిపనియున్నది నాయంతట నేనే లోనికిబోయెదను. (పోబోవును.)

లక్ష్మ—మునిచంద్రా! ఒక్కింత కాలము తాళజాలవా?

దుర్వా—నాసంగతి నీకు సంపూర్ణముగఁ దెలియును. ఇదిగో! నేఁజెప్పు చుంటిని. వినుము.

చ, వనమున నింక నీవు నను ♦ మానసమువీడుచు నాదు రాక, న
మ్మనుకులవార్ధిచంద్రునకు ♦ మానక తెల్పుము తెల్పకున్నచో
వినుము మదీయవాక్యమును ♦ బృథ్వివి బంధులతో, దనంబులో
దనయులతో నినుం గిలిసి ♦ దగ్ధునిగా శపియింతు లక్ష్మణా

లక్ష్మ—(తనలో) అక్కటా ఇప్పుడు నేనేమి సేయుదును ఈసమయ మున లోపలి కెవ్వరైన వచ్చినని వారిశిరము ఖండింతునని యగ్రజుఁడు పచించినాఁడు. దుర్వాసుండరుదెంచి తనరాక రామునికిప్పుడు దెలుపకపోయినచో నందరిని దగ్ధులగునట్లు శపి యింతునని కోపమునఁ బలికినాఁడు. (ఆలోచించి) కానిమ్ము. నాయొక్కనిమూలమున నందరును నేలమడియవలయును? నేన రిగితినేని రాముఁడు నాశిరమున మాత్రమే ఖండించును. తక్కిన వారి కేవిధమైన హానియుఁ గలుగదు. (దుర్వాసునిఁ జూచి) మునీంద్రా! ఏమైనను గానిమ్ము నీరాక రామునకుఁ దెల్పెద క్షణమాగుమీ. (దుర్వాసునితో నిష్క్రమించును.)

(తెర లేచును.)

[శ్రీరాముఁడు—యముడు సంభాషించుచు నుందురు.]

శ్రీరా—మునీంద్రా! నీ యభీష్ట మెద్దియో సెలవీయఁగోరెద.

యము—రామచంద్రా! నేను యముఁడను. నిజరూపమును, మరుగు పరచి యీమునివేషమున నీకడకు బ్రహ్మపంపున వచ్చితిని.

శ్రీరా—ధర్మాధర్మవిచక్షణుఁడవగు నీదర్శనమున నేను కృతా ర్థుండ నైతిని బ్రహ్మసందేశమును వినఁగోరెద.

యము—ఆ చతుర్ముఖుఁడు నీతో నిట్లు విన్నవింపుమనెను. నీవు శ్రీమన్నారాయణుండవు. దేవతా ప్రార్థితుఁడవై రావణ సంహారార్థమై యిట్లవతరించి చేయవలసిన పనులన్నియుఁ జేసితివి. ఇంక నాత్మధామమునకు దయసేయుము.

శ్రీరా—విరించి యాజ్ఞను మన్నింపఁదలఁచితిని గాక.

(లక్ష్మణుఁడు ప్రవేశించును.)

శ్రీరా—(లక్ష్మణునిఁజూచి) లక్ష్మణా! ఈసమయమున నేలవచ్చితివి?

లక్ష్మ—అగ్రజా! దూర్వాసమునీంద్రుఁడు భవద్దర్శనమునకు తొందర పడుచున్నాఁడు.

యము—(శ్రీరామునిఁజూచి) రామచంద్రా! ఇంక నాకనుజ్ఞ నిమ్ము.

(అంతర్ధానుఁడగును.)

శ్రీరా—తమ్ముఁడా! దుర్వాసుఁడగు దెంచినాఁడా! శీఘ్రముగ లోపలికి ప్రవేశపెట్టుము.

లక్ష్మ—(నిష్క్రమించును.)

శ్రీరా—మునీంద్రా! ఈ సేవకుని నమస్కారము. లందుకొనుము.

దుర్వా—మనము నెమ్మదిగా మాట్లాడుకొనవచ్చును. నేను పరము నిష్ఠంబూని నిరాహారుఁడనై యొకసంవత్సరమునుండి తపము సేయుచున్నాను. అయ్యది నిన్నటితోఁ బూర్తియైనది! నాకాకలిబాధ యధికముగనున్నది. ముందు నాయాకలిఁ దీర్పుము

శ్రీరా—మహాప్రసాదము మహాత్మా! దయసేయుము.

(నిష్క్రమింతురు.)

రంగము:—శ్రీరాముని మందిరము.

(ప్రవేశము:—శ్రీరాముడు—లక్ష్మణుఁడు)

లక్ష్మ—అన్నయ్యా! నీవు విచారించెద వేల? ఈశరీరము నీయధీనమై నది. దీనిని నీయిచ్ఛవచ్చినట్లు సేయుము.

శా. అన్నా! సందియమందె దేల యిటు నీ ♦ వాత్మప్రతిజ్ఞార్థమై
నన్నుం జంపి యశంబు నిల్పుకొను మ ♦ న్నా యీశరీరంబు నీ
దన్నా! నీయసికిశరీరమును నే ♦ నర్పించినన్ మోక్షసం
పన్నత్వంబును గాంచగల్గి సుఖయిం ♦ పంజాలుదున్ రాఘవా!

నాచిత్తవృత్తి నీకు సంపూర్తిగఁ దెలియును. నాహృదయ మెప్పుడును భవత్పాదారవింద సేవదప్ప నన్యమును గోరదు. నీపై నాకున్న మోహము, అనురాగము, పుత్రకళత్రాదులపైనన్నెనను లేదు. భవత్ప్రతిజ్ఞార్థమై యీదేహ మర్పించుట మదీయపూర్వ పుణ్యమనితలంచెదను.

శ్రీరా—(విచారముతో) హా? తమ్ముఁడా? కుమానాముని శేఖరుండగు యముని వాక్యామతినైన నేనొనర్చిన శపథము నీ వెఱిఁగియుండి యు, దుర్వాసుండరుదెంచి నంత నే యేల నాకడకు వచ్చితివి?

చ. అతఁడరుదెంచి పొమ్మనిన ♦ యంతనె వచ్చితివేల! యాతఁడున్
మతి నలుకన్ వహించియను♦మానము బూనక మమ్మునందఱన్
క్షితిపయిఁగూల శాపమును ♦ జెచ్చెరనిచ్చిన నిచ్చుఁగాక; ఏ
గతి నినుఁ జంపి నే బ్రతుకఁ ♦ గాగలవాడను భ్రాతృవత్సలా!

సీ. భక్తినాపైఁబూని ♦ వరభాగ్యముల వీడి
వనులకు నావెంట ♦ వచ్చినావు
పదునాల్గువర్షముల్ ♦ పడరాని యిడుమలఁ
బడి నాకు సేవల ♦ సలిపినావు

నన్నె దైవముగ మ ♦ నంబున భావించి
యంచితప్రేమ ♦ వర్తించినావు
నిరతంబు నాయాజ్ఞ ♦ శిరముపై ధరియించి
సేవకుని కరణిఁ ♦ జెలగినావు

తే. గీ. కటకటా లక్ష్మణా! నిన్ను ♦ గరుణవిడిచి
నాప్రతిజ్ఞకై యెట్లు దు ♦ న్మాడువాడ
నెట్టి తపముజేసినను నీ ♦ యట్టివాని
ననుజుఁగా బడయఁగలనె ♦ యవనియందు,

తమ్ముఁడా! నా సేవకంటెఁ బ్రపంచమున విశేషమైనది, మఱియొకటి లేదని తలంచినాడవు, ఒక నిమిషమైనను నన్నెడబాసియుండుటకుఁ దలంపనివాడవు, నాసౌఖ్యమే నీసౌఖ్యముగను, నాకష్టమే నీకష్టము గను భావించి మెలంగినవాడవు. అట్టి నిన్ను నేనెట్టు జంపుకొందును? అక్కటా! రాజధర్మము లెంతకఠినములు!

లక్ష్మ— అన్నయా! నీవు నన్నుఁగూర్చి చింతింపవలదు.

మ. తనువుల్ శాశ్వతమాయశోవిదితమాం ♦ ధాతాదిభూమీశ్వరుల్
చనరే? యైహిక సౌఖ్యముల్ నతములా ♦ జాయాత్మజుల్ నిత్యులా
ఘనసామ్రాజ్య రమాదిసంపదలు వే ♦ డ్కన్ వెంట నేతెంచునా
మనువంశోత్తమ? చింతవీడి ననుఁ జం ♦ పన్ ఖడ్గమున్ బూనుమా

ఈశరీరము నీప్రతిజ్ఞార్థమై వినియోగపడుట నాపూర్వపుణ్యకృతమే.

(అనుబంధము. 29)

శ్రీరా—తమ్ముఁడా! శరణాగతులకు నభయమిచ్చు నీహస్తములచేత, ఖలులను, లోకద్రోహులగు దైత్యులను వధించెడు ఈహస్తములచేత, పుణ్యచారిత్రుఁడగు నిన్నెట్లు వధింతును! అయ్యో! నాహస్తము లెట్లాడును?

[అనుబంధము 30]

లక్ష్మ— అగ్రజా నీవుసామాన్యమానవుని చందమున విచారించిన నే నేమనగలవాడను?

శా. అక్షీణ ప్రకట ప్రతాప బలశౌ ♦ ర్యంబుల్ విరాజిల్ల, లో
కక్షోభంబును సేయు దైత్యవరులన్ ♦ ఖండింపగా బుట్టు నా
సాక్షాద్విష్ణుడ నీవుకావె జగతీ ♦ శా యట్టిచో నేను, నీ
కాక్షేయాంబుస నేను జచ్చి స్థిరమౌ ♦ కైవల్యముం గాంచెదన్

(వసిష్ఠుడు—ప్రవేశము.)

శ్రీరా—(వసిష్ఠుని జూచి) మునీంద్రా వచ్చితివా? మొన్న నాకడ కరుదెంచిన మునితో జేసిన శపథంబు ననుసరించి తమ్ముని నెట్లు వధింపగలనాయని దుఃఖసముద్రమున మునిగియున్న నన్నుద్ధరించుట కేదైన మార్గ మరసి రక్షింపుము.

వసి—శ్రీమన్నారాయణుండవగు నీవిట్లు విచారించవలదు. లక్ష్మణు ని నీవు బరిత్యజింపుము. అత డిచ్చవచ్చిన యట్లుసేయును ప్రతిజ్ఞకుభంగముండదు.

శ్రీరా—నాచేతులతోం జంపుటకన్న నిది కొంతమేలే యగును (లక్ష్మణునిఁజూచి) భ్రాతృవత్సలుండవగు నిన్నువిడుటకైనను నాచిత్తము సమ్మతింపదు కాని విధిప్రేరణయిట్లున్నది.

లక్ష్మ—అన్నయ్యా! నీవు వగవకుము నీవు నన్ను విడువుము నేను సరయూనదిం గ్రుంకి శరీరము జాలించెదను.

శ్రీరా—ఎంతకష్ట మెంతకష్టము!

వసి— తే. గీ. నీవునారాయణుండవు ♦ నెలత సీత
యిందిరాదేవి నీకంటె ♦ ముందెయరిగి
యాత్మధామంబు నందు నీ ♦ యాగమనము

కోరకు వీక్షించుచున్నది ♦ ధరణిపాల
నీకు బాన్పైన శేషుడే ♦ నిశ్చయముగ
లక్ష్మణకుమారు డౌచు జె ♦ లంగినాడు
భరతశత్రుఘ్ను లే నీవు ♦ కరములందు
బట్టు శంఖుచక్రంబులు ♦ ధరణియందు
మీరు బుట్టిన కార్యంబు ♦దీరెగాన
జింతతో బనిలేదు శ్రీ ♦ కాంత వినుము.

శ్రీరా—(తనలో) బ్రహ్మసందేశముగూడ నిట్లేయైయున్నది. (లక్ష్మణుని జూచి) తమ్ముడా సౌమిత్రి నేను విచారము విడచి ధైర్యము బూనితిని. (ఇంచుకయూరకుండి భరతునిపుత్రులగు తక్ష పుష్కరులను గంధర్వరాజ్యంబున కధీశులుగానిల్పితిమి. శత్రుఘ్నుని పుత్రులను మధుపుర విదిశాపురంబులకు రాజులుగా జేసితిమి. నీపుత్రులగు నంగద చక్రకేతులను మల్లదేశాభిషిక్తులగావించితిమి. ఇంక మదగ్రపుత్రుండగు కుశుని నయోధ్యకు రాజుగాఁజేసి లవుని నుత్తరకోసలాధిపతిగా నియమించెదను. ఈరెండుపనులును నైనపిదప నీపగుగుము

లక్ష్మ—(వశిష్ఠుని) మునీంద్రా! కుశునకుఁ బట్టముగట్టు ప్రయత్నమున నుండుము రమ్ము.

(అందరు నిష్క్రమింతురు.)



రంగము:—[అయోధ్య- సభామందిరము:- సింహాసనముపై కుశుడు శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు—వసిష్ఠుడు]

శ్రీరా—కుశుని జూచి కుమారా! ఈయిక్ష్వాకు రాజసింహాపీఠముపై నిన్నాసీనుంజేసి యభిషేకము జేయుచుంటిని. (కిరీటమును దీసి కుశుని శిరమునఁబెట్టి)

సీ. తాతయగు దశరథ ♦ ధాత్రీవిభుని కీర్తి
లతలఁ బ్రాకింపగ ♦ దలపుమయ్య
జలజాప్తవంశజుల్ ♦ సత్యవ్రతులటన్న
నిర్మలయశమును ♦ నిలుపుమయ్య
అవనిపరోపకా ♦ రార్థమిదంశరీ
రమనువాక్యంబు న ♦ రయఁగదయ్య
మునిజనార్చనమును ♦ భూసుర సేవయు
భక్తిమైచేయుచుఁ ♦ బరగుమయ్య

తే. గీ. సత్యమే జయమని ♦ మానసంబునందు
దలఁచి సజ్జనుల్ పొగడఁగా ♦ మెలగుమయ్య
మహిత సాకేతనగర సా ♦ మ్రాజ్యలక్ష్మి
నిలపగా శాశ్వతముగఁ బా ♦ లింపుమయ్య.

వశి—తథాస్తు-తథాస్తు.

(తెరవ్రాలును.)

---

రంగము:—సరయూతీరము. ప్రవేశము:—శ్రీరాముఁడు, భరతుఁడు శత్రుఘ్నుఁడు, హనుమంతుఁడు మొదలగువారు.

శ్రీరా—తమ్ములారా! మనకంటె ముందుగా లక్ష్మణుడు సరయూనదిం గ్రుంకి దేహము జాలించినాఁడు. ఇంకమనమును నట్టి

కార్యమునే యిప్పుడు జేయవలయును. (హనుమంతుఁజూచి) హనుమా !

మ. హరకారుణ్య వరప్రభూతుఁడవు వే ♦ దాంతార్థవిజ్ఞాన శా
స్త్రరసాస్వాగమవేది వారయు భవి ♦ ష్యద్బ్రహ్మవుర్ నీవు; మ
చ్చరణాంభోరుహచింతనారతిని నా ♦ చంద్రార్క తారావనీ
శరధిస్థాయిగ భూమినుండి సను శ ♦ శ్వద్భక్తినర్పించు వా
రి రహింబ్రోచుచు నుండుమా సుమతివై ♦ శ్రీయంజనీపుత్ర నా

నీవు నాకీర్తిచంద్రికల వెలయించుచు భూమిపై నుండుము. (తమ్ములను జూచి) తమ్ములారా ! ఇఁక మనమిందుఁ బ్రవేశింతము. రండు.

[శ్రీరాముఁడు తమ్ములతో నదిలో మునుంగును.]

వెంటనే— తెరలేచును.

(వైకుంఠము:— శేషశయనుఁడగు శ్రీమహావిష్ణువు, లక్ష్మి, బ్రహ్మ)

బ్రహ్మ—(విష్ణుమూర్తిని జూచి) మహాత్మా! నారాయణా ! భృగు మునీంద్రుని శాపకారణంబున. నీకంటెముందుగ సీతయైయున్న లక్ష్మిదేవి యచ్చటకు విచ్చేసినది. దేవతాప్రార్థితుఁడవై రామావతారమునఁ జేయవలసిన కార్యములన్నియుఁ జేసివచ్చితివి. నాకెంతయు సంతసంబయ్యె.

తే. గీ. రామ శ్రీరామ జయరామ ♦ రామ యనుచు
భవ్య భవదీయనామంబు ♦ భక్తిదలచు
వారలకు శుభంబు లొసంగి ♦ వరలుమయ్య
మహిత కల్యాణచారిత్ర ♦ మాకళత్ర.

(తెరవ్రాలును)

ఇది సప్తమాంకము.

సర్వము సంపూర్ణము.





# సంపూర్ణోత్తరరామాయణము

## అనుబంధములు.

### అనుబంధము (1) రాముఁడు.

కాడన—ఏక.

వనితా కనుగొనుమా యా
వనరమణీయత - కన్నుల పర్వంబై యుండె॥ వని॥

1 మోదముగూర్చెడి పలువిధ - భూజంబులు
సాదరమతిఁ జూడఁగ - చనుదెమ్మిఁక ॥ వ॥

2 వివిధములగు వర - విరితరులవయి
రవ లొలుకఁగ బలుకు - చిలుకల గము లవిగో॥ వని॥

### (2) చాకలి వెంకడు.

నాలుసాలుపో పోవె - తెలిచె నిమోసము
పరమొగాడికడ సేరినావు - పాపాని కొడిగట్టినావు
తగునె తగునె - నన్ను మోసమును సేయ
మనసురోసె - మగువయింక॥ సాలు॥

(3) (ఎల్లి) నాదనామక్రియ - ఆది.

1 ఉండు ఉండనే - యనునామాట॥ ఓమగడాని ॥వుం॥
ఉండోసి యీరీతి - దండనేల నేయ - యెల్లకుండలేవె
పెట్టిపోయు , చుండినంచు - కొట్టేను - తిట్టేను - పడ్డాన ,
బంతినా యీరీతి - బాదుతావు॥ ఉం॥

2 ఏన్నోరోజుల్నుంచి - నీతోడవుండలేద
అన్నాయముగ - నేను - అయ్యయ్యో యిట్లందువె
తిన్నాగ పెద్దమనుసులతోడ చెప్పి
నిన్నేమి చేయిస్తనో - చూడింక॥ ఉ॥

(4) భరతుఁడు

లేశమైన కరుణఁ దలప కిట్లు సీత.
నడవులకుఁ - బనుపగనుఁ - దగదో రఘువర - వినుమా ॥లే

సాకి—ఆమానినీ శిరోమణిమహిమ నెఱిఁగియుండియు
నీమాడ్కి నవధియింప నీచిత్తమెట్లు సమ్మతించె

మిత్రము—మనమునందు సంశయంబు - మాని చెప్పుచుంటి
వనిత నడవులందు విడిచిరాగ బోవఁజాల॥ లేశ॥

(5) శత్రుఘ్నుఁడు.

ఆహాహా - శ్రీరామా - ఆలింపు మనవిఁ
అమలగుణస్తోమా - భూపుత్రిఁ - యుగాగ్రిటవికిఁ బనుపందగు ॥
అద్వైత్యనీటిలో - యామొగుణం బరయవె
సాదరమతిఁ జూడుము - సారసలోచన॥ ఆహా॥

(6) లక్ష్మణుడు - హిం। ముఖారి-ఆది

ప॥ భూపుత్రినేరీతి నే విడిచివచ్చెద॥

అ॥ ప॥ పాపాత్మునక వనంబులయందున-వరసాధ్వీమణియంచు బేర్గన్న॥
నే - నేమని వల్కగలవాడ - ఆయింతి
జానకితో - మానకనే - నిదిదెలిపిన - విని యకటా
మానసమున దీనిందలచి యెంతశోకించునో యేమితోచక
యుండెహా॥ భూ॥

(7) సీత - కానడ - ఏక

మఱదీ తెలుపుము నీవీ
కరుణనిగుందగ కారణమేమో॥మ॥
మును నీవెప్పుడును నీ - గతి నీమది
వనటనుగుంది యెఱుంగవు - భాసురచరితా ॥మ॥
వరసుతులని నను మాత్రే - భావమున సతతము
నరయుచునుందువుగా - నమలగుణా॥మ॥
పరధనమున్నను - గరళముగతినే
పరికించుచునుందువుగా - జనములు వినుతింపగ॥మ॥

(8) లక్ష్మణుడు—ముఖారి

సమయింపగదమ్మా యింక నీశాపంబున॥
కుమతినగుచు నీగతి దుష్కృత్యమొనర్చిన నను॥స॥
అపరాధము నెన్నడు నెఱుగని - విపులపుణ్యచరితను
విపినములకు జేర్చిన -బాపుడే, గతిన చిత్తుడను ॥స॥

(9) లక్ష్మణుఁడు—జేహాగ్

సాకి—ఓదిక్పాలులారా! సుగుణోజ్జ్వల భూమణులారా
ఓదివ్య మునీంద్రులారా - ఓసూర్యచంద్రులారా
మిత్రము-జనకతనయ నీమెవిడిచి - చనుచుచుంటి
మనములందు గరుణబూని మఱపరయ్యమీరలోదిll

(10) లక్ష్మణుడు—ముఖారి—ఆది

హా సీతా. నీగతి - కే - నేమని పగతును
భాసుర పుణ్యచరితకు నీగతి గల్పించితిగాllహాll
ఎందుబోదువో - యేమిసేయఁ దలతువో
డెందమునందు నెట్లు- గుందుచుంటివోllహాll

(11) లక్ష్మణుఁడు—యదుకులకాంభోజి—రూప

ఎంమల కరీతిని నీ - వింతగూర్చి యేంతయో
డెందమునఁ శోకమందెదు - భానువంశదీప రాఘవll ఎం
తాపసులున్ దేవతలుఁ - తద్దయు నిను వేడగాను
యీపుడమి భరంబువాప - నెంచి జన్మ మందితీవుll ఎం
సఖుదెలియని ధర్మ - మెందుగలదు జగతి
లోకనాధుడవు నివు - లోలాక్షియు నతలక్ష్మి ఎంl

(12) గాలవుఁడు—బిలహరి—చతురశ్రము

వలదు:వలదు-యీహాయము-బట్టగా- వలదిది యికవిడువుము సఖుడా
పలుపలుకు లికేటికి నను విను మా-వంకజనేత్రా-పరమచరిత్రా
జనకజపుత్ర సద్గుణగాత్రా॥ వల॥

మనమునందు నాలోచింపక - బట్టిరిటు దీనివెనుకనె వండో
మనుజనాథు డరు - దెంచుచుండు నిక పదపద యిలునేరంగ
సఖా॥వల॥

(13) శతృఘ్నుఁడు.

ఈ బాలుఁడెవఁడో - నృపాల - సూనునివలె నుండిన॥ఈ॥
శెబా సీతనిని మెచ్చవచ్చు నెంతయున్
విభీతిలేక జయవర్మ . నెదిరించు చుండెన్॥ఈ॥
ఇతని మొగంబులు, శశి నేలు, కనులా
సీతపద్మంబులఁదోలు భళిభళిర।ఈ॥

(14) శతృఘ్నుఁడు—నోకగు.

బాలుఁడ వీగతిబల్కగ సాహసమూనెదే
యాలములోపల శౌర్యము జూపుమికన్ ॥బా॥

2. తాపసపుత్రుడ వీగతి . ధరణీశులతో
నోపుదువే యుద్ధము సేయగ నకటా,
పాపముగా, నినుఁజంపిన మాకును; సం
తాపముగా నీతల్లికి బాలక ॥బా॥

(15) శతృఘ్నుఁడు—నోటు.

1. మాటలు బలుకగ నేటికి నీవిధమున
సూటిగ నెదుటను నిలువుమురా
పోటరివై ; రణరంగము విడక
తీటడగించెదనా ధైర్యము జూపుమురా॥మా॥

2. చలము బలం బేమాత్రముగలదో రణ
తలమున నిప్పుడే నాకును జూపుము రా
తలువా-పలువా-గలవా నిలువగ
బాలుడ నంచును నూహించితి వేమో॥మా॥

(16) సీత—కీరవాణి—చతురశ్రము.

హాకుమారా! హాసుకుమారా!
పూర్ణకాంతుతోడ భోగాడి-సాహసమున
నీకరణిని దుఃఖవార్ధినన్ను ముంచితే ॥హా॥
నాధుగానకున్న నీదు - నగుమొగంబు జూచుకొనుచు
మోదమందుచుండ - భూధవుండు కరుణలేక
ఈధరణ నీపయి శరమునేసి-యిట్లు జేసెనే
ఎంత నిన్ను జూతురా యింక - నేమి నేతురా॥హా॥

(17) కుశుండు—సాకీ

పరిపూర్ణశశిబోలు నీమోముఁజూచిన
కరుణబూనును నెంతి - కఠినచిత్తుండైన
ధరణీశుడేర కృపలేక నిల దాకి, యా
దురమునందున మూర్ఛవొచ్చె నకటా
సుకుమారుడ నీగతి చేకురె నీకనునే
నిక నేగతి జీవింతును. నిన్నిడనాడు హా ॥వ॥

(18) కుశుండు—ధీరశంకరాభరణము మేళము—చతురశ్రగతి.

మానసమున నీగతిని - మిక్కిలివగవగ - మాతరో తగదిక
ననువినుమా మానవతిని దెగవేయగ వడినేగి - భండనమం
దున జెండెద, నీ॥మా॥
దదిగరుణఁ - గనకిటులాతమ్ముని మారొ్కనెనుగదా

సాకీ—అపరమకఠినాంతరంగుండూ
భూపాలవంశ బడబానలుండు
ఆగర్వాంధకార ప్రమత్తహృదయుండూ

ఇక్కడనుంచి త్రిశ్రగతి

కడుపసివాడని మదిదలంపక యిట్లుజేసెగదా, మునిమొదవానిఁ
తమ్ముని౯ వెసదెచ్చెద జూడుమా ॥మూ॥

(19) (పేజి 77) కుశుడు

బాలుడనో నీపాలిటికి౯ - గాలుడనో చూడురా
యాజిమునందు ధైర్యముతో - వాలాయంబు నన్నెదిరింపుము
గా॥ బా॥ సంగరరంగంబున నా- యంగజరిపు యేతెంచినరాసీ
భంగంబొందించెద విఖ్యాత - తింగని మొదచూడుముగారా॥ బా

(20) శ్రీరాముండు—ముఖారి.

అనుజా నామది దోచకయున్నది
రణమున హారెనై ననునోర్చెడి- ఘనబలుడగు శత్రుఘ్నుని
వనములనుండెడు మునితనయు డేగతి గూల్చగగలిగె॥అ॥
బవరమునందును దర్పంబేరిచి-లవణునిదునిమిన తమ్ముడు
యవిరళశౌర్యధను డకటకటా-భువి నెలుగూలెనోగదా ॥అ॥

(21) సీత.

హా రామా, శ్రీభానుకులసోమా.
హే నాదునోనాథ - నామనోనాథ
జేనేమి సేయుదాన నిక- నెందుజొచ్చెదాన
నేరివేడుదాన; బుత్రులిట్లు - నిన్ జేసిరికద
ఘోరసంగ్రామంబందు౯ ఆ॥ హా॥

(22) యదుకుల కాంభోజి—రూప

వందనమో రామునతీ - వందనంబు, అంజనీ
నందను దర్శించునట్టి-యందముగనను బ్రోవుమా ॥వం॥
సూనుడ నాదు జననీ - మానసమున బ్రేమతోడ
మానిని నను జూచిగావు. మానక నిను గొలుతు భక్తిని॥వం॥

(23) సీత—బేహాగ్—రూప

తాపసవరసనుదయతోను మా
భూపతి రాముడు తనయులచే బడెనట ॥తా॥
సవనహయంబును బట్టి-సాహసమేర్పడ
బవరమునందుం భరతాదుల, నవిరళ
శౌర్యముల బాలు రీ యవనిపై గూలగనేసిరట ॥తా॥

(24) లవుడు

జనకుడని మది నెఱుగక. యా-మునుకులతిల
కునితో-రణ మొనరించిన పాపము మమ్మున్
ఘనకృపతో గావుము.

సాకీ—ఓ వాల్మీకి సంయమీంద్రా
ఓ సమస్త సద్గుణసాంద్రా
యిత్తరి మాజనకునిగను భాగ్యము గూర్చి
చిత్తములకున్ మోదము గల్గింపుము॥జ॥

25 కుశుడు—బారువ—ఆది

రాముని మేఘశ్యాముని।నుగుణో
ద్ధాముని జనకుని-దయ గనుగొనుమా॥రా॥
మామది దెలియక-యీ మాన్యచరితునకు
సీమహి యొగ్గు నొనర్చితి-మో మునితిలకా॥రా॥

జనకుని గనుగొనుమహావాది-మునివరగోరుచునుండెను
ఘనకృప బూనుచు-ఘనజేయుమిదె మొ్రక్కెద ॥రా॥

29 కుశుడు.

అపరాధము క్షమియించుచు నను-గృపగనుగొనుమో జనకా॥ అ॥
కృపణుడ-కుటిలుడ-కపటాంతఃకరణుడ
పాపుడని తలంపక నా॥అ॥
మమ్ము చూచితివైన నీ-చిత్తమ్మున దయబూని మా
యమ్మనేలుమయ్య-సమ్మతితో శ్రీరామచంద్ర॥ అ॥

27 శ్రీరాముడు.

హాసీతా-పూతచరితా-సుగుణసంఘూతా॥
ఈనరణికే నేనీయెడ-నీశపధంబును జేయిం
చితినంచును నీనున నన్నును- బాపితివా-యెడబాసితివా॥హా॥

28 లవుడు.

తగునే జననీ మమ్మొగతి విడనాడగ॥తగు॥
మిగులక నగలంబోగలగ జేసితివీ
జననియందింకెవ్వరికే-ఘనముగ బిల్చుచు
మనమున నానందింతుము॥తగు

29 లక్ష్మణుడు.

అనుమానమేల యిటువినుమా-కనుమా రామా॥
నను నీచరణదా-సునివధించి-ప్రీతి
ననుగా పాడికొనుచు-ఘనయశమందుము॥అ॥
నీశపథముకొరకు నా-శిరమర్పించుట
వాసియగునత దా-శ్రీసీతాధిప నీమది॥ అ॥

10 శ్రీరాముఁడు—సాకీ.

హా మదాజ్ఞాపరిపాలనాధారేయా
హానిరంతర కరుణాయయాంతరంగా
హాశరణాగతరక్షణ దీక్షకంకణా
హా సుమిత్రాగర్భశుక్తి ముక్తాఫలా
మనమునందుగరుణవిడచి యెట్లునిన్ను జంపువాడ
ననుజ శోచకున్న దేమి యెందుజొత్తు వగతు నెట్లు॥హా॥

షడ్రాగ మంగళహారతి—ఆదితాళం

చక్రవాకస్వరజతి.

(మంచిసమయ మిదెరార నామనోహర)

(1) హారతిదిగొరా, చేకొరా, శ్రీరామా జయ॥ హా॥
సారతరమహా । దార దీన। మందార, దేవగాంధారిరాగమున॥

(2) వాణీశస్తోత్రరు । ధాత్రీసుతపాత్ర । గీర్వాణ సుగుణజిత
బాణ భువన సంత్రాణ నీకు గ । ల్యాణిరాగమున॥ హా॥

(3) హాటకచేలా । ధృతకూటస్థఖే లాతప్త॥ హా హాటకాక్షగ
ర్వాపహరణ ఖగ ఘోట నీకు జంఝూటిరాగమున॥ హా॥

(4) ఖేచరవినుతా । సంకోచరహిత సుర॥ ఖే॥
ధీచతుర, జితవిరోచనాత్మజ,కృపాచనాత్మక మాంచిరాగమున॥హా

(5) దీపితాకారా । సుధీరనాధార సం॥ దీ॥
పాపదూరవిశ్వ। రూపసద్గుణ । కలాప నీకిదె కాఫిరాగమున॥హా॥

(6) భాసురచరితా భూ । మీసురవినుతా॥ భా॥
దాసజనమనోల్లాసమానిహ్ర। ద్వాసానీకుధన్యాసిరాగమున॥హా॥

